Sachcha Deen-1
(Telugu)

# ఇస్లాం ప్రబోధిని

## (మొదటి భాగం)

మూలం
**అఫ్జల్ హుసైన్**

అనువాదం
**అబ్బాదుల్లా**

# విషయ సూచిక

ఈ పుస్తకంలో విద్యార్థులకు, యువకులకు ఇస్లామ్ మౌలిక విశ్వాసాలు, ఆరాధన విషయాలతోపాటు దైవప్రవక్తలు, మహా పురుషుల జీవిత గాథలు ఉన్నాయి. నైతిక విలువలు, ప్రవర్తనా సరళి, సామాజిక జీవన విధానం ఇంకా అనేక నిత్య జీవితావసర విషయాలు హృదయానికి హత్తుకునేలా సామాన్యులకు సైతం అర్థమయ్యేలా సరళమైన భాషలో వ్రాయబడ్డాయి. ఈ పుస్తకం పిల్లలకు ఎంతో ఉపయోగపడుతుందని ఆశిస్తూ....

డైరెక్టర్,
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాద్

# 1. అల్లాహ్

ఓ ప్రభూ! నీవే సృష్టికి నిర్మాతవు
భువిని సృష్టించావు. సుందరంగా చేశావు
నేలను పరిచావు. సస్యశ్యామలం చేశావు
ఆ నేలపైనే అందరికీ వసతి కల్పించావు
ఓ ప్రభూ! నీకే మా శిరోవందనం
నీవే మా ఆరాధ్య దైవం
చిలుకలకిచ్చావు మధుర గానం
రంగురంగుల పూలకిచ్చావు పరిమళం
సూర్యునికిచ్చావు మెరిసే కాంతి
నక్షత్రాలకిచ్చావు కిరణాల రాత్రి
ఓ ప్రభూ! నీకే మా స్తోత్రం
నీవే మా ఆరాధ్య దైవం
చల్లని గాలులు వీచేలాజేశావు
జీవజలాన్ని కురిసేలాజేశావు
మొక్కల్ని చెట్లను పెంచావు
ఫలపుష్పాలతో సమృద్ధిపరిచావు
నీవే ఉపాధినిచ్చి మమ్మల్ని పెంచావు
ఓ ప్రభూ! నిన్నే మేము స్మరిస్తాం
నీవే మా ఆరాధ్య దైవం

**చేయాల్సిన మరి కొన్ని పనులు**

ఈ గేయాన్ని కంఠస్థం చేసి శ్రావ్యంగా పఠించండి.

# 2. మన ఆరాధ్య దైవం

ఆరాధనలకు, దాస్యానికి తగినవాడు; మన అందరి ఆరాధ్య దైవం, స్తుతికి స్తోత్రానికి అర్హుడు అల్లాహ్ మాత్రమే. ఆయనే మనల్ని సృష్టించాడు. భూమ్యాకాశాలను ఆయనే నిర్మించాడు. గాలుల్ని వీచేలా చేసి వర్షాన్ని కురిపించేదీ ఆయనే. మొక్కల్ని, చెట్లను పెంచేదీ ఆయనే. పండ్లు, ధాన్యం పండించేది ఆయనే. అందరికి అన్నపానీయాల వసతి కల్పించింది ఆయనే. ఆయన చేతుల్లోనే అందరి జీవన్మరణాలున్నాయి. ఆయనే ఈ జగతికి ప్రభువు. ఆయన అధికారమే అంతట చెల్లుతుంది. అందరూ ఆయనకు దాసులే. ఎవరైతే అల్లాహ్‌ను వదిలి ఇతరులను ఆరాధిస్తారో వారు మార్గభ్రష్టులవుతారు. అల్లాహ్ ఆజ్ఞ లేనిదే ఎవరు మనకు లాభనష్టాలు చేకూర్చలేరు, ప్రయోజనపడలేరు కూడా. అందుచేతనే అల్లాహ్‌ను వదిలి మనం మరొకరిని ఆరాధ్య దైవంగా పరిగణించం, మరొకరి ఎదుట తలవంచి నిలబడం కూడా. సహాయం చెయ్యమని అల్లాహ్‌నే అర్థిస్తాం. అల్లాహ్‌ను వదిలేస్తే అందరు నిస్సహాయులే. ఇతరుల దగ్గర ఉన్నదంతా కేవలం అల్లాహ్ అనుగ్రహం తప్ప మరొకటి కాదు. ఇది మనకు తెలుసు. మనిషికి లభించే అనుగ్రహాలు అల్లాహ్ తలచినంతవరకే. తద్వారానే మనిషి వాటిని అనుభవిస్తాడు, ఇతరులకు లాభం చేకూర్చుతాడు. కలిమి లేములు కలవారు, చిన్న పెద్ద అందరు అల్లాహ్‌పై ఆధారపడ్డవారే. అందుచేతనే మా ప్రార్థన

ఓ అల్లాహ్! నీవే మా ఆరాధ్య దైవం
మేము ఆరాధించేది నిన్నే
సహాయం చెయ్యమని అర్థించేది నిన్నే.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలివ్వండి**

1) మనందరి ఆరాధ్య దైవం కేవలం అల్లాహ్‌యే. ఎందుకని?
2) అల్లాహ్ మనకు ఏమేం ప్రసాదించాడు?
3) ఈ జగతికి యజమాని, పాలకుడు ఎవరు?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. ఎవరయితే అల్లాహ్‌ను వదిలి ఇతరులను ఆరాధిస్తారో వారు........................... లౌతారు.
2) అల్లాహ్ ............లేనిదే ఎవరూ మనకు లాభనష్టాలు చేకూర్చలేరు, ప్రయోజనపడలేరు కూడా.
3) సహాయం చేయమని మనం............ నే అర్థిస్తాం.
4) చిన్నా పెద్దా అందరూ అల్లాహ్‌పై............. వారే.

# 3. ప్రియప్రవక్త (సఅసం)

మన ప్రియప్రవక్త అహ్మద్ గారు
అబ్దుల్లా కుమారులు వారు
విశ్వ కారుణ్యమూర్తిగ వచ్చారు
సల్లల్లాహు అలైహి వసల్లం

అరబ్బు చంద్రుడు మార్గం చూపారు
గౌరవంతో పలకాలి ఆయన పేరు
అందరితో ఆత్మీయతే ఆయన తీరు
సల్లల్లాహు అలైహి వ సల్లం

ధర్మం ప్రబోధించారు సజ్జనులుగ మార్చారు
దౌర్జన్యం తొలగించారు ఐక్యతతో నడిపించారు
కాలచక్రం త్రిప్పారు దౌష్ట్యం తొలగించారు
సల్లల్లాహు అలైహి వసల్లం

ఓ ప్రభూ! కల్గించు మాలో సద్భావనలు
కావాలి అందరు ఆయన అనుచరులు
ఆయన తప్ప లేరు మరో నాయకులు
సల్లల్లాహు అలైహి వ సల్లం

**చేయాల్సిన మరి కొన్ని పనులు**

ఈ గేయాన్ని కంఠస్థం చేసి మీ మిత్రులతో కలసి చదవండి.

# 4. దైవప్రవక్త (సఅసం)

అల్లాహ్ అందరిని సృష్టించాడు, సృష్టి ఆయనకే చెల్లు. ఆయనే అందరికి అన్నపానీయాల వసతి కల్పించాడు. అందుచేత అల్లాహ్ అందరి యజమాని, పరిపాలనాధికారి కూడా.

మనమందరం ఆయన్నే ఆరాధిస్తాం. ఆయనకే దాసులం. దైవదాస్యం మన కర్తవ్యం. ఆయన ఆజ్ఞలను పాలించడం మన ధ్యేయం. ఆయన కోరేమిటో ఆయన దాస్యం ఎలా చెయ్యాలో, ఇవన్నీ తెలిపేందుకు అల్లాహ్ తన ప్రవక్తల్ని ప్రపంచంలోకి పంపాడు. ఈ ప్రవక్తల్ని సందేశ ప్రబోధకులు, పైగంబరులు, హెచ్చరికలు చేసేవారు (నబీలు) అని కూడా అంటాం. ప్రవక్తలందరూ సాధారణ మానవులు, దైవదాసులు కూడా. వీరందరు సత్యసంధులు. దోషరహితులు. దైవం పంపిన హితోపదేశాల్ని ప్రజలకు అందిస్తారు. మన ప్రియప్రవక్త ముహమ్మద్ (స) అల్లాహ్ పంపిన చివరి ప్రవక్త. ఆయన తర్వాత మరో ప్రవక్త లేరు. ఆయన దైవం కోరేదేమిటో తెలిపారు. అల్లాహ్ అవతరింపజేసిన సందేశాన్ని మానవాళికి తెలియపరిచారు; దైవమిచ్చిన ఆజ్ఞలననుసరించి జీవితం గడిపారు. అందరికి మార్గదర్శకులయ్యారు. ఆయన్ను చూసి జీవితాల్ని ఎలా మలచుకోవాలో మనం తెలుసుకున్నాం.

జీవిత విధానం చివరి ప్రవక్త(స) మనకు తెలిపారు. ఆ విధానం పాటించడంలోనే మన విజయం ఉంది. ఆయనే విశ్వనాయకుడు. ఆయన చూపించిన వెలుగు బాటననుసరిస్తూ ప్రజలు దైవ సంతోషం పొందగలరు. ఆయన మాట చక్కటి బాట. ఈ వెలుగు బాట తప్ప మిగతా మార్గాలు అన్నీ తప్పుడు మార్గాలే.

రండి! మనమందరం కేవలం మన ఆత్మీయ ప్రవక్త చూపించిన విజయ మార్గంపైన నడుద్దాం. ప్రపంచవాసులందరినీ ఈ మార్గం వైపునకు పిలుద్దాం. అందులోనే ఉంది మనందరి సాఫల్యం.

అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్ వ బారిక్ వ సల్లం

చివరి ప్రవక్తపై శాంతి, సలాములు కలుగుగాక!

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1) అల్లాహ్‌యే మనందరి యజమాని, పాలకుడు. ఎందుకు?

2) అల్లాహ్ ప్రవక్తలను ఎందుకు పంపాడు?

3) ప్రజలు అల్లాహ్‌ను ఎలా సంతోషపెట్టగలరు?

4) చిట్టచివరి ప్రవక్త ఎవరు?

5) ప్రియప్రవక్త(సఅసం) పేరు విన్నప్పుడు ఏం అనాలి?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1) మనం అల్లాహ్ ..........

2) ప్రవక్తల్ని సందేశ ప్రబోధకులు, ......... అని అంటాం.

3) ప్రవక్తలందరూ సాధారణ మానవులు, ............. కూడా.

4) ప్రియప్రవక్త తెలిపిన జీవిత విధానంలోనే మన ........... ఉంది



# 5. ఇస్లాం

అల్లాహ్ కృప వల్ల మనం ముస్లిములము. మన ధర్మం ఇస్లాం. ఇస్లాం సత్యధర్మం. ఇస్లాంను అనుసరించేవారు ముస్లిములు. అంటే అల్లాహ్ ఇచ్చిన ఆజ్ఞల్ని ఆలకించి పాలించేవాడే ముస్లిం. మనమందరం అల్లాహ్‌కు విధేయులం. ఆయనిచ్చిన ఆజ్ఞల్ని పాటిస్తాం.

అల్లాహ్ సర్వోత్తమ గుణాలు కలవాడు. ఆయన మంచికి పుట్టినిల్లు. సత్ప్రవర్తన అంటే ఆయనకెంతో ఇష్టం. మంచి పనులు చెయ్యమని, చెడుకు దూరంగా ఉండమని శాసించాడు కూడా. ఆయన చెప్పింది చేయడం మన వంతు. అప్పుడే సౌశీల్యం మనకు అలవడుతుంది. అల్లాహ్ మనల్ని అమితంగా ప్రేమిస్తాడు. అల్లాహ్ ప్రేమకు పాత్రులయ్యాక అందరి ప్రేమాదరణలు మనకుంటాయి. అజ్ఞానులు అల్లాహ్ పట్ల విశ్వాసం కలిగి వుండరు. ఆయన ప్రబోధనల్ని పెడచెవిన పెట్టి వాటిని అనుసరించేందుకు నిరాకరిస్తారు. వీరినే కాఫిర్లంటారు. సత్యాన్ని కప్పిపుచ్చేవాడు తిరస్కారి (కాఫిర్). దైవ తిరస్కారి మంచివాడు కాజాలడు. సత్యానికి దూరంగా అసత్యానికి చేరువగా ఉంటాడు.

అందుచేతనే దైవ తిరస్కారులంటే అల్లాహ్ ఇష్టపడడు. వారంటే అల్లాహ్ ఆగ్రహిస్తాడు. అల్లాహ్ ఆగ్రహం పొందేవారికి శిక్ష ఉంటుంది. ఆ శిక్ష నుండి రక్షించే వారెవరూ ఉండరు. అల్లాహ్ ఆజ్ఞలు జవదాటకుండా నడుపమని, చెడుకు దూరంగా ఉంచమని, మంచివారిగా, సజ్జనులుగా చేయమని అందరి ప్రేమకు నోచుకునే భాగ్యం కలగాలని మనమందరం ప్రార్థిద్దాం.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1) సత్యధర్మం ఏది?
2) అల్లాహ్‌కు ఇష్టమైన విషయాలు ఏవి?
3) 'ముస్లిమ్' అని ఎవరిని అంటారు?
4) 'కాఫిర్' అని ఎవరిని అంటారు?
5) మనం అల్లాహ్‌ను ఏమని వేడుకోవాలి?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1) అల్లాహ్ కృప వల్ల మనం ............
2) మన ధర్మం ............

3) అల్లాహ్ ....... పనులు చేయమని ఆదేశించాడు.

4) అల్లాహ్ .......... పనులకు దూరంగా ఉండమని ఆదేశించాడు.

5) ఓ అల్లాహ్ మమ్మల్ని నీ ............... పైన నడిపించు.

**(ఇ) కింద పేర్కొన్న విషయాలు ముస్లిములకు సంబంధించినవైతే వాటి ముందు 'ము' అని, ఒకవేళ అవి కాఫిర్లకు సంబంధించినవయితే వాటి ముందు 'కా' అని రాయండి.**

1) అల్లాహ్ విధేయులు ( )

2) అమాయకులు ( )

3) అల్లాహ్ ఆదేశాలను తిరస్కరించేవారు ( )

4) మంచి వారు, సత్యవంతులు ( )

5) అల్లాహ్‌కు ఇష్టంలేనివారు ( )

6) అల్లాహ్‌కు ఇష్టమైనవారు ( )

7) శిక్షింపబడేవారు ( )

8) ఇస్లామ్ ధర్మాన్ని అనుసరించేవారు ( )

9) మంచిని, సత్యమైన విషయాలను తిరస్కరించేవారు ( )



# 6. కలిమా

ఇస్లాం ధర్మపు తొలి పలుకు అన్ని పలుకుల కంటే మిన్న దేవుని పిలుపు.

لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ مُحَمَّدٌ رَّسُوْلُ اللّٰهِ

**లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్ రసూలుల్లాహ్**

ఇదే మన కలిమ. దీని అర్థం అల్లాహ్ మన ఆరాధ్య దైవం. ఆయన తప్ప ఆరాధనకు అర్హులు మరొకరు లేరు. హజ్రత్ ముహమ్మద్(స) అల్లాహ్ పంపిన ప్రవక్త.

ఈ సద్వచనాన్ని పఠించి ప్రజలు ముస్లింలవుతారు. దీనినే మనసార స్వీకరించామని సాక్ష్యం పలుకుతారు. మనం పుట్టినప్పుడే ఈ వచనం పఠించి మన చెవిలో ఊదటం జరిగింది. ప్రతి రోజు ఐదు పూటలా నమాజు వేళలకు ముందు ప్రతి మసీదు నుండి ఈ సద్వచనం అజాన్‌లో వినిపించడం జరుగుతుంది. ఈ శిష్ట వచనాన్ని మనసారా అంగీకరించి వల్లె వేస్తుంటాం కూడా.

విశ్వాస వచనపు అర్థం ఏమిటి? దాస్యం కేవలం అల్లాహ్‌కే చెయ్యాలి. అల్లాహ్‌ను వదిలి మరొకరిని పూజించడమనేది మనసులో కూడా ఊహించలేము. ముస్లిమేతరులు కూడా ఇలాంటి ప్రవచనాన్ని ఎలా తిరస్కరించగలరు? కొద్దిగా ఆలోచించి చూడండి. అల్లాహ్ అందరిని సృష్టించాడు, అన్నపానీయాల సౌకర్యం కల్పించాడు. ఆయన గుప్పెట్లోనే మన జీవన్మరణాలున్నాయి. గాలి, వానలు ఆయన ఆజ్ఞల్ని పాటిస్తూ వస్తున్నాయి. చెట్లు మొక్కలు ఆయన పెంచితేనే పెరుగుతున్నాయి. పండ్లు, పుష్పాలు, ధాన్యాలు ఆయన పండిస్తేనే పండుతున్నాయి. సృష్టిలోని ఏ పని కూడా ఆయన కోరికకు అతీతంగా జరగడం లేదు. అందులో ఎవరికి భాగస్వామ్యం లేదు. ఆయనిచ్చిన అనుగ్రహాలు ఇన్నీ అన్నీ కావు. అన్నిటినీ అనుభవిస్తూ ఎవరు స్వామి ద్రోహానికి పాల్పడగలరు? ఆయన్ను వదిలి మరొకరికి పూజలు ఎవరు చేస్తారో, ఎవరు నిజస్వామిని వదిలి మరో స్వామిని పూజిస్తారో అలాంటి వారు దైవాగ్రహానికి గురవుతారు.

ఆయనిచ్చిన అన్నపానీయాల్ని అనుభవిస్తున్నాం. అందుచేత ఆయన్నే స్తుతిస్తున్నాం. అతడే అల్లాహ్. అతన్నే ఆరాధ్యదైవంగా స్వీకరించాలి. మరొకరిని పూజించడానికి ఒప్పుకోకూడదు కూడా. ప్రతి విశ్వాసి నుండి ఇదే ఆశిస్తున్నాం.

మహాప్రవక్త ముహమ్మద్(స) అల్లాహ్ పంపిన సందేశ ప్రబోధకుడు. చివరి ప్రవక్త కూడా. ఇది మన విశ్వాసం. యావత్ప్రపంచాన్ని సన్మార్గం వైపునకు పిలుపునివ్వడానికి ముహమ్మద్ (స)ను అల్లాహ్ పంపాడు. ఆయన చూపిన శ్రేయస్కర మార్గాన్ననుసరిస్తే ఇహపర సౌఖ్యాల్ని పొందగలం. అల్లాహ్ సంతోషానికి పాత్రులవుతాం కూడా.

ముస్లిమేతరులు మహాప్రవక్త(స) జీవిత చరిత్రను అవగాహన చేసుకుంటే ఆయన ఆదర్శాన్ని గ్రహించినట్లయితే, వారి అంతరాత్మ సాక్ష్యం పలుకుతుంది. ఆయన ప్రబోధననుసరిస్తే ఇహపరాల విజయం సాధ్యమవుతుందని ఒప్పుకోక తప్పదు. ప్రవక్త(స) ప్రబోధనల్ని వదిలి మరో మార్గం ఎవరైనా తెలిపితే అది చెల్లని నాణెంలా ఉంటుందనడంలో సందేహం లేదు. ఓ అల్లాహ్! మహాప్రవక్త(స) చూపించిన వెలుగు బాటపై నడిపించి మా జీవితాలను సార్థకపరచు. (ఆమీన్)

## అభ్యాసం

### (అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి

1. ఇస్లాం ధర్మపు తొలి పలుకు, ఇతర అన్ని పలుకుల కంటే మేలైన పలుకు ఏది?
2. ఒక్క రోజులో అజాన్ ఎన్నిసార్లు ఇస్తారు?
3. కలిమా వాక్యాలు అజాన్‌లో ఏవిధంగా పలుకుతారు?
4. ఎవరు చూపిన మార్గాన్ని అనుసరిస్తే అల్లాహ్ మన పట్ల సంతుష్టుడవుతాడు? ఇంకా మనం ఈ లోకంలో కూడా సుఖసంతోషాలతో ఉండగలం?
5. ముస్లిమేతరుల అంతరాత్మ ఏమని సాక్ష్యం పలుకుతుంది?
6. ప్రవక్త(స) ప్రబోధనల్ని వదిలి మరో మార్గం ఎవరైనా తెలిపితే అది ఏమవుతుంది?

### (ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి

1. కలిమాను ............. అంగీకరించి వల్లె వేస్తుంటాం.
2. ఈ సద్వచనాన్ని పఠించి ప్రజలు ........ లౌతారు.
3. ముస్లిములు కేవలం ........ దాస్యం మాత్రమే చేస్తారు.
4. అల్లాహ్ ఇచ్చిన అన్నపానీయాల్ని అనుభవిస్తున్నాం, అందుచేత ఆయన్నే ..................



# 7. స్వర్గ నరకాలు

ఒక అబ్బాయి చెబుతున్న విషయం : మేమొక మృతదేహ ఖననం కోసం వెళ్ళాం. చాలామంది గుమిగూడారు. వచ్చిన వారిలో మృతుని బంధువులున్నారు, పొరుగువారున్నారు. అతనితో కలిసిమెలిసి తిరిగిన వారున్నారు.

అందరూ శోకతప్త హృదయులై ఉన్నారు. ఉదాసీనత అందరిలో కనబడుతోంది. ఇంటిలో మహిళలు, పసికందుల ఆక్రందనలు వినబడుతున్నాయి. మాకు కూడా దు:ఖం కలిగింది. మృత్యువు తలంపునకు వచ్చింది. రోజు మృత్యువు మానవుల్ని కబళిస్తూనే ఉంటుంది. స్త్రీ పురుషులు, పసిపిల్లలు, వయోవృద్ధులు మృత్యువు కాటుకు బలవుతుంటారు. ప్రతి ఒక్కరు ఒక దినం మరణిస్తామని గుర్తిస్తారు. పుట్టినవారు గిట్టడం ఖాయం. ఇక ప్రశ్న మరణానంతరం ఏమవుతుంది? ఈ ప్రశ్న నాలో పదేపదే కలవరపాటును కలిగిస్తూనే ఉంది.

అంత్యక్రియల తర్వాత ఇంటికి తిరిగివెళ్ళాం. ఇంటికి వచ్చాక ఆంతర్యంలో వెంటాడే ప్రశ్నకు జవాబు కావాలని అమ్మను అడిగాను. ఆమె నిర్మలంగా ఇలా అన్నారు :

"ప్రపంచంలో ప్రజలు జన్మిస్తుంటారు. మరణంతో జీవితం ముగించుకుంటుంటారు. కాని ఒక దినం వస్తుంది. ఇక్కడున్న ప్రాణకోటి సమస్తం మరణిస్తుంది. ప్రపంచం అంతమవుతుంది. ప్రళయం వస్తుంది, మరణించిన వారందరికీ అల్లాహ్ మళ్ళీ ప్రాణం పోస్తాడు. ప్రపంచంలో వారు చేసిన పనులకు లెక్క తీసుకొంటాడు. ఎవరైతే అల్లాహ్ ఉపదేశాలను పాటించి నడుచుకున్నారో, అల్లాహ్ పంపిన సందేశ ప్రబోధకులననుసరించారో, మంచి మంచి పనులు చేసివెళ్ళారో, వారంటే దైవం సంతోషపడతాడు. శాశ్వతంగా వారిని స్వర్గంలో ప్రవేశింపజేస్తాడు. అది వారికి శాశ్వత నివాసంగా ఉంటుంది. అక్కడే వారికి అన్ని సుఖాలు, సౌలభ్యాలుంటాయి. మంచి మంచి భవనాలుంటాయి. రకరకాల పండ్లుంటాయి. పాలు, తేనెలు ప్రవహించే సెలయేరులుంటాయి. స్వర్గవాసులు హాయిగా వుంటారు. కోరినవన్నీ వారికి లభిస్తాయి. అల్లాహ్ అనుగ్రహం పొందినవారికి ఏది తక్కువ ఉండదు. అల్లాహ్ ప్రబోధనలను పెడచెవిన పెట్టినవారు ఆయన ఆజ్ఞల్ని ఉల్లంఘించినవారు, ప్రవక్తలతో పరిహాసం చేసినవారు, చెడ్డ పనులు చేసినవారు ఆయన కోపానికి పాలవుతారు. శిక్షకు అర్హులవుతారు, దండించబడతారు. నరకంలో వేయబడతారు. అక్కడే వారు పడి వుంటారు. అది దుర్భర బాధలకు నిలయం. ఎర్రని మంటలు వారిని చుట్టుముట్టుతాయి. అందులోనే కాలుతూ ఉంటారు దుర్జనులు. ఇంకా తేళ్ళు, మండ్రగబ్బలుంటాయి. నల్లమచ్చల విష సర్పాలుంటాయి. పాప పంకిలంలో పడిన వారికి అవన్నీ కాటువేస్తాయి. గాయాల కడుగు ఉంటుంది. దాహంతో పరితపించే వారికి ఆ కడుగు ఇవ్వబడుతుంది. ఊహలకు కూడా అందని శిక్షల్ని పాపాత్ములు అక్కడ అనుభవిస్తారు.'

అమ్మ అన్ని విషయాలు పూసగుచ్చి చెబుతుంటే భయభ్రాంతులతో కంపించిపోయాను. అల్లాహ్ మనల్ని క్షమించుగాక! ఆయన ప్రేమ, సంతోషాలకు పాత్రులయ్యేట్లు చేసి స్వర్గంలో ప్రవేశించే అదృష్టం కల్గించుగాక! నరకాగ్ని నుంచి మనల్ని రక్షించుగాక! ఆమీన్.

## అభ్యాసం

**ఈ క్రింది వాటిని జత చేయండి**

| **(అ)** | **(ఆ)** |
|---|---|
| స్వర్గం | ప్రపంచం అంతమవుతుంది |
| | అన్నిరకాల సుఖాలుంటాయి |
| | పెద్దపెద్ద తేళ్ళు, నల్లని పాములుంటాయి |
| ప్రళయం | పచ్చని వనాలుంటాయి |
| | మరణించిన వారందరినీ అల్లాహ్ తిరిగి బ్రతికిస్తాడు |
| నరకం | చెడ్డ నివాసం |
| | అల్లాహ్ అందరి పనుల లెక్క తీసుకుంటాడు |
| | చీము, నెత్తురు త్రాగుతారు |
| | పాలు, తేనెల సెలయేళ్ళుంటాయి |

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. ప్రళయం ఎందుకు సంభవిస్తుంది. మనిషి తిరిగి ఎప్పుడు బ్రతికించబడతాడు?
2. స్వర్గవాసులు, స్వర్గంలో ఎంతకాలం వరకు ఉంటారు?
3. నరకానికి ఎవరు వెళతారు?
4. మనం అల్లాహ్‌ను ఏమని ప్రార్థించాలి?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. ప్రళయదినం నాడు అల్లాహ్ అందరినీ మళ్ళీ ........
2. స్వర్గంలో పాలు, తేనె .......... ఉంటాయి
3. .............. చాలా చెడ్డ నివాసం.
4. ఓ అల్లాహ్ మమ్మల్ని .............లో ప్రవేశించే అదృష్టం కలిగించు.



# 8. ఆరాధన

దాసులు దైవానికి చేసే సేవ ఆరాధన అనబడుతుంది. మనమందరం అల్లాహ్‌కు దాసులం. దైవం తన దాస్యం కోసం మనందరిని సృష్టించాడు. మనం చేసేది ఆయన దాస్యం. ప్రతి పని ఆయన ఆజ్ఞప్రకారం, ఆయన కోరినట్లు చేస్తాం. ఆయనను వదిలి మరొకరికి ఆరాధన చేయడం, స్తుతిగానం చేయడం చెల్లదు. దైవదాసులు అల్లాహ్‌కు తప్ప మరొకరికి తలవంచడం మహా పాతకం.

అల్లాహ్‌కు ప్రణామం చేయవలసిన మానవులు తమలాంటి జీవులను, మరణించిన వారికి, భూత ప్రేతాలకు, జిన్నులకు దేవదూతలకు ప్రణమిల్లుతూ వారి ఎదుట శిరస్సు వంచి నిలబడి లేదా దేవీ దేవతలను, రాళ్ళు రప్పలను, చెట్లు చేమలను, జంతువులను, క్రిమి కీటకాదులను పూజిస్తే ఇంకా ఇష్టం వచ్చినట్లు దాసోహం పలికితే అది దైవం పట్ల విద్రోహం ప్రకటించినట్లే అవుతుంది. అల్లాహ్ ఇచ్చిన అన్నపానీయాలు సేవిస్తూ ఇతరుల్ని ప్రస్తుతించడం సమంజసమేనా? అట్టి వారిని అల్లాహ్ క్షమించడు. వారిని కఠినశిక్షకు గురిచేస్తాడు.

అల్లాహ్ అభిలాషకు వ్యతిరేకంగా మనం ఏమీ చెయ్యం. మనం ఆయన దాసులమే. అందుచేత ఆయనిచ్చిన ఆజ్ఞల్ని శిరసావహిస్తాం.

ముస్లింల జీవితం సంపూర్ణ దైవదాస్యంలో గడుస్తుంది. క్రమం తప్పకుండా నమాజులు చేస్తాం, ఉపవాసాలు ఉంటాం,జకాత్ చెల్లిస్తాం, హజ్ నిర్వర్తిస్తాం. నిత్యం సత్యమే పలుకుతాం. అబద్ధాల జోలికి పోకుండా జాగ్రత్త పడతాం. తల్లిదండ్రుల సేవ చేస్తాం, పెద్దల్ని గౌరవిస్తాం, చిన్నవారిని ప్రేమిస్తాం, ఎవరి మనసు నొప్పించం, తుదకు జంతువుల్ని కూడా హింసించం. ఇచ్చిపుచ్చుకోవడంలో నీతి నిజాయితీలను పాటిస్తాం. ఆటపోటీలలో గెలిచినా ఓడినా సరే మోసం చెయ్యం. అడగకుండా ఇతరుల సొమ్ము ముట్టుకోం. ధర్మమైన వాటినే తింటాం, నిషేధించిన వాటి దరిదాపులకు కూడా పోము. అంతెందుకు అల్లాహ్‌కు నచ్చిన పనులన్నీ చేస్తాం. నచ్చని పనుల బారినుండి దూరంగా మసలుకుంటాం. ఈ విధంగా జీవితం గడపడం ఆరాధన అనబడుతుంది. అప్పుడే మన పూర్తి జీవితం ఆరాధనకు ప్రతీకగా ఉండడం సాధ్యమవుతుంది.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. అల్లాహ్ మనల్ని ఎందుకు సృష్టించాడు?
2. అల్లాహ్‌ను తిరస్కరించేవారు ఎవరు?
3. ఎలాంటి జీవితం గడపడం ఆరాధన అనబడుతుంది?

**(ఆ) ఈ క్రింది వాక్యాలను శ్రద్ధగా చదవండి. వాటిలో కొన్ని అల్లాహ్‌కు విధేయత చూపే వాక్యాలు, మరికొన్ని అవిధేయత తెలిపే వాక్యాలు వున్నాయి. వాటిని వేరు చేయండి.**

1. అల్లాహ్‌ను కాకుండా ఇతరుల ముందు సాష్టాంగపడడం.
2. అల్లాహ్ ఆదేశాలను పాటించడం.
3. జీవించి ఉన్న వారికి గాని మరణించినవారికి గాని సాష్టాంగపడటం
4. దేవుళ్ళు, దేవతలు, విగ్రహాలు, వృక్షాలు లేదా జంతువులను పూజించడం
5. జీవితాంతం అల్లాహ్ ఆరాధనలో గడపడం
6. ఎల్లప్పుడూ సత్యాన్నే పలకడం
7. జంతువులను సైతం హింసించకుండా ఉండడం
8. ఇష్టానుసారం చేసుకుపోవడం
9. అనుమతి లేకుండా ఇతరుల వస్తువు తీసుకోవడం
10. హరామ్ (అధర్మ) పదార్థాలు తినడం



# 9. నాన్నగారితో నేనూ వెళ్తాను మసీదుకు ఈ రోజు

రాత్రి సమయం అంతమయింది, ప్రాతఃకాలం వస్తుంది
అదిగో అల్లంత దూరాన ఉదయం నమాజు పిలుపు వినబడుతుంది
మేలుకో అమ్మ అన్ని వైపుల తెల్లని వెలుగు కనబడుతుంది
నన్ను లాలించి ప్రేమించే అమ్మ నమాజు వేళయింది

నాన్న గారితో నేను వెళ్తాను మసీదుకు ఈ రోజు
పొయ్యి మీద కాస్త వేడి నీళ్ళు పెట్టవమ్మా
పల్లు తోముకోవడానికి మిస్వాక్ ఇవ్వవమ్మా
వుజూ ఎలా చేయాలో చూపవమ్మా
పరిశుభ్రమైన బట్టలు వేసుకోవాలి, తొందరగా ఇవ్వవమ్మా

నాన్న గారితో నేను వెళ్తాను మసీదుకు ఈ రోజు
మెత్తగా ఉంది ఉలన్ స్వెట్టర్, తలపై వెచ్చని టోపి
చేతులకున్నాయి గ్లోవ్స్, తొడుగుకొన్నా సాక్స్ దులిపి
లావు దుప్పటి వేసుకొన్నా, మెడపై ఉంది మఫ్లర్ కొత్తది
చలి ఏమాత్రం తగలడం లేదమ్మా, అంతా వెచ్చగా ఉంది

నాన్న గారితో నేను వెళ్తాను మసీదుకు ఈ రోజు
అల్‌హమ్ద్, ఖుల్‌హువల్లాహు సూరాలు చక చక వినిపిస్తాను వినవమ్మా
సుబ్‌హానకల్లాహుమ్మ అంతా చెబుతాను సరిచూడవమ్మా
అల్లాహ్ ఆజ్ఞల్ని అనుసరిస్తూ వుజూ చేస్తాను గమనించవమ్మా
అల్లాహ్‌ను అర్థించే విధానం అంతా నేర్చుకొంటానమ్మా

నాన్న గారితో నేను వెళ్తాను మసీదుకు ఈ రోజు
జమాఅత్‌తో ఫరజ్ నమాజు చేశాక
రెండు చేతులెత్తి వినయ వినమ్రతలతో వేడుకుంటానమ్మా
అన్ని చెడుల నుండి కాపాడు నా ప్రభూ!
నన్ను నమాజులు చేసేవాణ్ణి చెయ్యి ఓ ప్రభూ!
నాన్న గారితో నేను వెళ్తాను మసీదుకు ఈ రోజు

# 10. నమాజు వల్ల కలిగే లాభాలు

మనల్ని సృష్టించినవాడు అల్లాహ్. పోషించేది ఆయనే. ప్రపంచంలో ఎన్నో వసతులు కల్పించాడు. మక్కువతో పెంచే అమ్మనిచ్చాడు. కుటుంబ పోషణకు ప్రియమైన నాన్నగారినిచ్చాడు. అందరి హృదయాలలో ప్రేమానురాగాలు పోశాడు. పిల్ల పాపలుగా మేము ఇంటిలో ఉంటూ తల్లిదండ్రుల కంటికి చల్లదనం ఇస్తుంటాం. ఇంకా అల్లాహ్ మా కోసం గౌరవనీయులైన ప్రవక్తల్ని పంపాడు. వారు మాకు రుజుమార్గం చూపించారు. బ్రతుకు ఇచ్చారు. నిత్య సుఖసౌఖ్యాలు, ఇన్ని వరాలు పొందాక అల్లాహ్‌కు కృతజ్ఞత తెలుపాలి కదా?

ఆయన సంతోషమే మా అభిలాష. అందుచేత రేయింబవళ్ళు ఆయన్నే స్తుతిస్తుంటాం. ఆయన గుణగణాలను స్మరిస్తుంటాం. అంతేకాదు మంచి పనులు చేస్తాం. అల్లాహ్ ఆగ్రహానికి గురికాకుండా జాగ్రత్తపడతాం.

అల్లాహ్‌ను సంతోషపరిచే మార్గం ఉందా? అవును, మంచి మార్గం ఉంది. అదే నమాజు, ప్రతిదినం ఐదు పూటలు నమాజు చేస్తాం. అందుకోసం మసీదుకు వెళ్తాం. మసీదు అల్లాహ్ ఆరాధనాలయం. అది ఆయన దర్బారు. పరిశుభ్రంగా ఉంటూ మసీదుకు వెళ్తాం. ఆ దర్బారు దర్జాగా ఉంది. అందరి పాదుషా కొలువు తీరే దర్బారు అది. నమాజు మనల్ని ఆ పాదుషాకు చేరువ చేస్తుంది. వినయంతో, అటు ఇటు చూడకుండా, ఆయన మమ్మల్ని చూస్తున్నాడనే భయంతో నమాజులో నిలబడతాం. నిండు మనసుతో నమాజు చేస్తాం. అల్లాహ్ పవిత్ర గుణగణాలను స్తుతిస్తాం. తెలిసి తెలియక చేసిన తప్పులకు తలవంచి క్షమాపణ కోరుకుంటాం. పుణ్యకార్యాలు చేస్తాం. సత్ప్రవర్తనకు అలవాటు పడతాం. మలినం అంటదు, పరుష పదాలు పలకం, సిగ్గుమాలిన పనుల నుండి దూరంగా ఉంటాం. అంతరంగంలో బాహ్యంలో కూడా పరిశుభ్రత కలిగి వుంటాం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వేళకు సరిగా నమాజుకు వెళ్తాం. ప్రతి పని వేళకు సరిగా చేయడం అలవాటవుతుంది. నమాజు వల్ల ఎన్నో సుగుణాలు మాలో పెంపొందుతాయి. ఆచరణ మారుతుంది. మంచి అలవాట్లు మాలో వస్తాయి. అందరి అభినందనలు అందుకొంటాం, నక్షత్రాల్లా మెరుస్తుంటాం.

నమాజు పుణ్యఫలానికి పుట్టినిల్లు. అందుచేతనే ఐదుపూటలా నమాజులు చేస్తూ లెక్కలేనన్ని ప్రయోజనాలు పొందుతాం.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. అల్లాహ్ మనకు ఏఏ అనుగ్రహాలను ప్రసాదించాడు?
2. మనం నమాజ్ ఎందుకు చేస్తాం?
3. నమాజ్‌లో మనం ఏంచేస్తాం?

**(ఆ) క్రింద పేర్కొన్న వాక్యాల్లో సరైన వాటి మీద (✓) టిక్కు పెట్టండి**

1. ప్రపంచంలో మంచి పనులు చేసినవారికి అల్లాహ్ ఏమిస్తానని వాగ్దానం చేశాడు
   (పరలోకం, నమాజ్, స్వర్గం, ఆగ్రహం)
2. మేము మస్జిద్‌కు అనగా అల్లాహ్ దర్బారుకు వెళతాం
   (ఠీవీగా, మాటామంతి చేసుకోవడానికి, శుచిశుభ్రతగా ఉంటూ)
3. మనం అల్లాహ్‌కు అత్యంత సమీపంలో ఉంటాం
   (మస్జిద్‌లో, నమాజ్‌లో, ఇంట్లో, బజార్లో)

**(ఇ) క్రింద పేర్కొన్న వాటిని జత చేయండి**

| (అ) | (ఆ) |
|---|---|
| 1. అల్లాహ్ మన పట్ల → | కలుస్తాం |
| 2. మంచి వాళ్ళతో | → సంతోషంగా ఉంటాడు |
| 3. పరస్పరం | అలవరుతుంది |
| 4. మంచి పనులు | కట్టుబడి పోతాయి |
| 5. మనం కాలానికి | కనుపాపలైపోతాయి |
| 6. అశ్లీల పనులకు | అలవాటు పడుతుంది |
| 7. పరిశుభ్రంగా ఉండే | దూరంగా ఉంటాం |
| 8. మంచి విషయాలు | ఒకచోట కలుస్తాం |

## చేయాల్సిన మరి కొన్ని పనులు

మస్జిద్‌కు వెళ్ళి ఐదుపూటల నమాజ్ జమాఅత్‌తో పాటు కలిసి చదవండి



# 11. నమాజు వేళలు మరియు అజాన్

మేము రోజు ఐదుపూటలు నమాజు చేస్తాం.

ఉదయం ఉషోదయం తరువాత సూర్యోదయానికి ముందు ఫజర్

సూర్యుడు మధ్యాహ్నం పడమరకు వాలినప్పుడు జొహర్

సూర్యాస్తమయానికి గంటన్నర, రెండు గంటల పొద్దు ఉన్నప్పుడు అసర్

సూర్యాస్తమయం అయినతోడనే మగ్రిబ్

నిద్రపోకముందు ఒకటిన్నర రెండు గంటల రాత్రి గడిచాక ఇషా నమాజులు చేస్తాం.

మేమున్న వీధిలో మసీదుంది. ఆ మసీదులో గడియారం కూడా ఉంది. నమాజు వేళల్ని తెలియపరిచే చార్టు ఉంది. అందుచేత నమాజు వేళలు తెలుసుకోవడం సులభం. వీటి సహాయంతో నమాజు వేళలు నిర్ణయించుకుంటాం. వేళకు సరిగా సామూహికంగా నమాజులు చేస్తాం. మేఘాలు ఉన్నా, మంచు కురుస్తున్నా సూర్యుడు కనబడినా, కనబడకపోయినా, నమాజు ఛార్టు చూసి గడియారంలో గంటలు చూసి నమాజులు వేళకు సరిగా చేస్తాం. నేను నమాజు వేళకు ముందే మసీదుకు వెళ్ళే ప్రయత్నం చేస్తాను. మసీదులో కసువు వగైరా ఊడ్చి శుభ్రపరుస్తాను, జానమాజులు పరచడంలో సహాయపడతాను, వుజూ చేయడానికి వచ్చినవారికి లోటాలో నీరు ఇస్తాను.

ఐదుపూటలు నమాజుకు ముందు 'అజాన్' ఇవ్వబడుతుంది. 'అజాన్' వాక్యాల్ని శ్రద్ధాసక్తులతో ఆలకిస్తాను. అజాన్‌లో ఉన్న పదజాలాన్ని నేను మెల్లిగా వల్లిస్తుంటాను. ఇప్పుడు అజాన్ నాకు కంఠస్తమయింది. అవసరమైతే నేనే మసీదులో అజాన్ పిలుపునిస్తాను. ఒక దినం జొహర్ నమాజు వేళ అయింది. అజాన్ ఇచ్చే సమయమయింది. అక్కడ ఎవరూ లేరు, నేనే నిలుచుని అజాన్ ఇచ్చాను.

ఖిబ్లా (కాబా) వైపు ముఖం చేశాను. ఎత్తైన స్థలంలో నిలిచాను. చూపుడు వేళ్ళు రెండు చేవుల్లో వేసి వినేవారికి వీనుల విందుగా అజాన్ ఇచ్చాను.

**అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్** اَللّٰهُ اَكْبَرُ اَللّٰهُ اَكْبَرُ

అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, అల్లాహ్ అందరికంటే గొప్పవాడు

**అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్** اَللّٰهُ اَكْبَرُ اَللّٰهُ اَكْبَرُ

అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, అల్లాహ్ అందరికంటే గొప్పవాడు

**అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహ్** اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ

అల్లాహ్ తప్ప ఇతరులు ఆరాధనకు అర్హులు కారని నేను సాక్ష్యం పలుకుతున్నాను.

**అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహ్** اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ

అల్లాహ్ తప్ప ఇతరులు ఆరాధనకు అర్హులు కారని నేనుసాక్ష్యం పలుకుతున్నాను.

**అష్హదు అన్న ముహమ్మదుర్రసూలుల్లాహ్** اَشْهَدُ اَنَّ مُحَمَّدًا رَّسُوْلُ اللّٰهِ

ముహమ్మద్(స) అల్లాహ్ పంపిన సందేశ ప్రదాత అని నేను సాక్ష్యమిస్తున్నాను.

**అష్హదు అన్న ముహమ్మదుర్రసూలుల్లాహ్** اَشْهَدُ اَنَّ مُحَمَّدًا رَّسُوْلُ اللّٰهِ

ముహమ్మద్(స) అల్లాహ్ పంపిన సందేశ ప్రదాత అని నేను సాక్ష్యమిస్తున్నాను.

**హయ్యు అలస్సలాహ్ హయ్యు అలస్సలాహ్** حَيَّ عَلَى الصَّلٰوةِ حَيَّ عَلَى الصَّلٰوةِ

(కుడివైపు ముఖం తిప్పి) నమాజు కోసం రండి, నమాజు కోసం రండి,

**హయ్యు అలల్ ఫలాహ్ హయ్యు అలల్ ఫలాహ్** حَيَّ عَلَى الْفَلَاحِ حَيَّ عَلَى الْفَلَاحِ

(ఎడమ వైపు ముఖం తిప్పి)

సాఫల్యం కోసం రండి, సాఫల్యం కోసం రండి

**అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్** اَللّٰهُ اَكْبَرُ اَللّٰهُ اَكْبَرُ

అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, అల్లాహ్ అందరికంటే గొప్పవాడు

**లా ఇలాహ ఇల్లల్లాహ్** لَا اِلٰهَ اِلَّا اللّٰهُ

అల్లాహ్ తప్ప ఇతరులు ఆరాధనకు అర్హులు కారు

అజాన్ ఇచ్చాను. దుఆ చేశాను. చాలా మంది నమాజు చేసేవారు వచ్చారు. సామూహికంగా నమాజు చేశాం.

**'ఫజర్ నమాజు కోసం ఇచ్చే అజాన్'**

ఒక రాత్రి తెల్లవారక ముందే మేల్కొన్నాను. నిద్రపట్టడం లేదు. మంచం మీద అటు ఇటు పొర్లుతున్నాను. ఫజర్ నమాజు కోసం అజాన్ ఇవ్వబడుతుంది. ధ్యాసతో వింటున్నా. ఎప్పుడు మాదిరి అజాన్ ఇవ్వబడుతుంది.

**హయ్యు అలల్ ఫలాహ్** حَيَّ عَلَى الْفَلَاحِ వరకు విన్నా, ఆ తరువాత

**అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్** اَلصَّلٰوةُ خَيْرٌ مِّنَ النَّوْمِ

నమాజు నిద్రకన్నా మేలైనది اَلصَّلٰوةُ خَيْرٌ مِّنَ النَّوْمِ

**అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్**

అని రెండుసార్లు చెప్పడమయింది. ఫజర్ నమాజుకు ఇవ్వబడే అజాన్‌లో వేరే నమాజులకు ఇవ్వబడే అజాన్‌లో ఈరెండు వాక్యాలు అదనంగా ఉన్నాయి. అవి కూడా నేను కంఠస్తం చేసుకొన్నాను. అవసరమైతే ఫజర్ నమాజ్ అజాన్ కూడా నేను ఇవ్వగలను.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. అజాన్ ఇచ్చేటప్పుడు కుడివైపు, ఎడమ వైపు ముఖం తిప్పి ఏమని పలుకుతాం?
2. ఫజర్ అజాన్ ఇచ్చేటప్పుడు 'అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్' అని ఎప్పుడు పలుకుతాం?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. మా వీధిలో ఉన్న మస్జిద్‌లో గడియారం ఉంది. నమాజ్ వేళల్ని తెలిపే................ కూడా ఉంది.
2. నేను ఎల్లప్పుడూ ................... ముందే మస్జిద్‌కు వెళ్ళడానికి ప్రయత్నిస్తాను.
3. ఐదు పూటలు ..................కు ముందు అజాన్ ఇవ్వబడుతుంది.
   అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్ ............ అజాన్‌లో పలుకుతారు.
4. అజాన్ ఇచ్చేటప్పుడు .................. వైపు ముఖం తిప్పి నించోవాలి.

**ఈ చిత్రంలోని గుర్తుల ప్రకారం వివిధ ఫరజ్ నమాజుల పేర్లు బ్రాకెట్లలో వ్రాయండి**



## చేయాల్సిన మరి కొన్ని పనులు

1. అజాన్ వాక్యాలు కంఠస్తం చేసుకుని అజాన్ ఇచ్చేందుకు ప్రయత్నించండి
2. మస్జిద్ పనుల్లో సహాయపడుతూ ఉండండి.

# 12. ఉజూ చేసే విధానం

అజాన్ వింటూనే మేము ఆటలు మాని, పనులు ఆపి నమాజుకు వెళ్తాం. ఐదుపూటలు మసీదులో నమాజు చేస్తాం. మసీదు అల్లాహ్ కోసం నిర్మించిన దర్బారు. పరిశుభ్రంగా ఉంటూ మేము మసీదుకు వెళ్తాం. సలాం చేస్తూ మసీదులో ప్రవేశిస్తాం. క్రమం తప్పకుండా వుజూ చేస్తాం.

**ఉజూ విధానం**

ఉజూ చేయడం నాకు బాగా వచ్చు. మంచినీళ్ళు లోటాలో తీసుకొంటా, ముఖం ఖిబ్లా వైపు ఉండేట్లు ప్రయత్నం చేసి కూర్చుంటా. ఉజూ చేస్తున్నప్పుడు నీటి చుక్కలు పైనపడకుండా, లోటాలో కూడా నీటి చుక్కలు పడకుండా ఉండేటట్లు కూర్చుని వుజూ ప్రారంభిస్తా. లోటాను ఎడమవైపు పెట్టుకొంటా. మొదట వుజూ చేయడానికి సంకల్పం చేస్తా. 'బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీం' అంటూ ముంజేతి వరకు మూడుసార్లు నీటితో కడుక్కుంటా. మూడుసార్లు నీటిని నోటిలో తీసుకొని పుక్కిలించి, గరారా చేస్తాను. పళ్ళను తోమి శుభ్రపరుస్తాను. ఆ తరువాత మూడు సార్లు ముక్కులో నీరు ఎక్కించి ఎడమ చేయి చిటికెన వేలుతో ముక్కు రంధ్రాల్ని పరిశుభ్రపరుస్తా. ఆ తరువాత మూడుసార్లు ముఖం మొత్తం కడుగుతా. ఆ పిమ్మట రెండు చేతులు మోచేతి వరకు- మొదట కుడి చెయ్యి ఆ తరువాత ఎడమ చెయ్యి కడుగుతాను. రెండు అరచేతుల్ని నీటితో తడిచేసి తల, చెవులు, మెడ వెనుక భాగాన్ని 'మసహ్' చేస్తాను. చివరన రెండు పాదాలు- చీలమండలాల వరకు కడుగుతా. వుజూ చేశాక మసీదులో వెళ్ళి మౌనంగా ఒకచోట కూర్చుంటా. అక్కడ నిశ్శబ్దంగా ఉండాలి, మాట ముచ్చట చేయరాదు. ప్రవేశించింది అల్లాహ్ దర్బారులో. పరిశుభ్రంగా ఉంటుంది దాని పరిసరం. చెత్త చెదారం వేయకుండా ఇతరులు వేయనీయకుండా చూస్తా. అల్లాహ్ పరిశుభ్రతను ఇష్టపడతాడు.

## అభ్యాసం

**వుజూ చేసే విధానాన్ని క్రమపద్ధతిలో రాయండి**

తల, చెవుల మసాహ్ చేయాలి
పుక్కిలించాలి
బిస్మిల్లా పలకాలి
కాళ్ళు కడుక్కోవాలి
మణికట్టు వరకు చేతులు కడగాలి
సంకల్పం చేసుకోవాలి
చెవులను, మోచేతులను కడగాలి
ముక్కును శుభ్రం చేసుకోవాలి
ముఖం కడగాలి

## చేయాల్సిన మరి కొన్ని పనులు

1. వుజూ ఎలా చేస్తారు? చెంబులో నీళ్ళు తీసుకోండి. వుజూ చేసి చూపించండి.

# 13. మనం నమాజు ఎలా చేస్తాం?

ఉజూ చేశాం, నమాజు వేళ అయింది. వచ్చిన ఆరాధకులు ఫరజ్ నమాజ్ కోసం లేచి బారులు తీరి నిలబడ్డాం. బారులు చక్కదిద్దుకొన్నాం. అందరు తమ ముఖాల్ని ఖిబ్లా వైపు చేశాం. అందరికంటే ముందు ఇమాం గారు ఒక్కరే నిలబడ్డారు. ఆ వెనుక పెద్దవాళ్ళు వరుసలు తీరి నిలబడ్డారు. వారి వెనుక నిలబడిన వరుస పిల్లవాండ్లది. నమాజులో అందరు భుజానికి భుజం ఆనించి నిల్చుంటారు. ఏ వరుసలో కూడా మధ్యన ఖాళీ వదలం. ఖాళీ ఉందంటే షైతాన్ చేరతాడు. నమాజులో కలకలం సృష్టిస్తాడు. చక్కగా బారులు తీరి నిలబడ్డాక తక్బీరు చెబుతారు. ఈ తక్బీరు కూడా నాకు బాగా వస్తుంది. చాలా సులభం కూడా.

'అజాన్' ఇచ్చినట్లే చెబుతూ

**హయ్య అలల్ ఫలాహ్** حَيَّ عَلَى الْفَلَاحِ తరువాత

**ఖద్‌ఖామతిస్సలాహ్** قَدْ قَامَتِ الصَّلٰوةُ

**ఖద్‌ఖామతిస్సలాహ్** قَدْ قَامَتِ الصَّلٰوةُ (నిశ్చయంగా నమాజు స్థాపితమైంది.)

అదనంగా చెబుతూ మిగిలినదంతా అజాన్‌లో చెప్పినట్లే చెప్పాలి. కాకపోతే అజాన్ బిగ్గరగా, ఆగిఆగి ఇస్తారు. చూపుడు వేళ్ళను చెవులలో పెట్టి చెబుతారు. తక్బీరు అజాన్ మాదిరి ఎక్కువ బిగ్గరగా చెప్పరు. చూపుడు వేళ్ళను చెవులలో కూడా పెట్టుకోరు. తక్బీరు చెప్పే సమయంలో చేతులు విడిచి పక్కలను తాకుతూ ఉండేట్లు వదలివేస్తాం.

**నమాజు చేసే విధానం**

తక్బీర్ చెప్పిన తరువాత ఇమాం సాహెబు గారు బిగ్గరగా **అల్లాహు అక్బర్** اَللّٰهُ اَكْبَرُ అంటూ రెండు చేతులెత్తి పిమ్మట నాభి వరకు దించి రెండు చేతులు ఒక దానిపై ఒకటి కట్టుకొంటాడు. ఎడమ చెయ్యి క్రింద, కుడి చెయ్యి పైన ఉంటుంది. నమాజు చెయ్యడం నాకు బాగా వస్తుంది. మేమందరం **అల్లాహు అక్బర్** اَللّٰهُ اَكْبَرُ అని చాలా మెల్లగా పలుకుతూ ఇమాం సాహెబు లాగే చేతులు కట్టుకొన్నాం. ఇప్పుడు మేమంత అల్లాహ్ సమక్షంలో వినమ్రతతో నిలుచున్నాం. ఇక ఎవరితో మాట్లాడం, అటు ఇటు దిక్కులు చూడం. 'సజ్దా' చేసే స్థలంపై చూపు పెట్టి నెమ్మదిగా 'సనా' చదువుతాం.

سُبْحٰنَكَ اللّٰهُمَّ وَبِحَمْدِكَ وَتَبَارَكَ اسْمُكَ وَتَعَالٰى جَدُّكَ وَلَآ اِلٰهَ غَيْرُكَ ○

**సుబ్‌హానకల్లాహుమ్మ వ బిహమ్దిక వతబారకస్ముక వతఆలా జద్దుక వలా ఇలాహ గైరుక్.**

*ఓ అల్లాహ్! నీవు పరిశుద్ధుడవు, స్తుతి స్తోత్రం నీకే చెల్లుతుంది. నీ నామం శుభప్రదం, నీ గొప్ప తనం మహోన్నతమయింది. నీవు తప్ప మరో ఆరాధ్యుడు లేడు. శరణు వేడుకొంటున్నా భ్రష్టుడైన షైతాన్ బారి నుండి.*

దీని తరువాత اَعُوْذُ بِاللّٰهِ مِنَ الشَّيْطٰنِ الرَّجِيْمِ ؕ بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ **అవూజు బిల్లాహి మినష్షయితా నిర్రజీమ్ బిస్మిల్లా హిర్రహ్మానిర్రహీమ్**

అపార కృపాకరుడు అమిత దయామయుడైన అల్లాహ్ పేరుతో అని చెప్పాక, ఇమాం గారు సూరె ఫాతిహా **'అల్ హమ్ద్'** పఠిస్తారు. ఈ సూరా పఠనానంతరం ఆరాధకులందరు **'ఆమీన్'** అంటారు. ఇమాం సాహెబ్ గారు మరొక సూరాను పఠిస్తారు. ఒక్కోసారి పెద్ద సూరాను పఠిస్తారు. మరోసారి చిన్న సూరాను. ఎన్నో చిన్నచిన్న సూరాలు నాకు కంఠస్తం అయ్యాయి. **'అల్ హమ్ద్', 'ఖుల్‌హు అల్లాహ్', 'ఇన్నా అతైనా', 'వల్‌అస్‌రి'** లాంటి సూరాలు నేనెప్పుడో నేర్చుకున్నాను. దివ్యఖుర్‌ఆన్ 30వ అధ్యాయంలోని చివరి పది సూరాలు కూడా తొందరగా నేర్చుకొంటాను. ఇమాం సాహెబ్ రెండవ సూరాను చదివాక **అల్లాహు అక్బర్** అంటూ వంగుతారు. దీనినే **'రుకూ'** అంటాం. రుకూలో ఉంటూ కనీసం మూడు పర్యాయాలు, లేకుంటే ఐదు పర్యాయాలు నెమ్మదిగా سُبْحَانَ رَبِّيَ الْعَظِيْمِ **సుబ్‌హాన రబ్బిఅల్ అజీం** అని అంటాం. దీని అర్థం మహోన్నతుడైన నా ప్రభువు పరమ పవిత్రుడు. తరువాత ఇమాం సాహెబ్ గారు سَمِعَ اللّٰهُ لِمَنْ حَمِدَهٗ **'సమి అల్లాహు లిమన్ హమిదా'** అంటూ నిలబడతారు. మిగిలినవారు కూడా నెమ్మదిగా رَبَّنَا لَكَ الْحَمْدُ **'రబ్బనా లకల్ హమ్ద్'** అంటూ నిలబడతారు. ఈ పదాలకు "ఓ అల్లాహ్! నీవు మా ప్రభువువి. నీకే సమస్త స్తోత్రాలు' అని అర్థం. తరువాత ఇంకా కొంతమంది **'రబ్బనాలకల్ హమ్ద్‌**తోపాటు حَمْدًا كَثِيْرًا طَيِّبًا مُبَارَكًا فِيْهِ **'హమ్దన్, కసీరన్ తయ్యిబన్ ముబారకన్ ఫీహ్'** అని అంటారు. దీని తరువాత **'అల్లాహు అక్బర్'** అంటూ సజ్దా చేస్తాం. ముక్కు, నొసటిని నేలపై మోపి కనీసం మూడు లేక ఐదు పర్యాయాలు నెమ్మదిగా سُبْحَانَ رَبِّيَ الْاَعْلٰى **'సుబ్‌హాన రబ్బియల్ ఆలా'** అంటే ఉన్నతుడైన నా ప్రభువు పవిత్రుడు అని అంటాం. **అల్లాహు అక్బర్** అంటూ తల ఎత్తి కొద్ది సమయం నిర్మలంగా కూర్చుంటాం. మళ్ళీ **'అల్లాహు అక్బర్'** అంటూ రెండవ సజ్దా చేస్తాం.మూడు లేక ఐదుమార్లు నెమ్మదిగా **'సుబ్‌హాన రబియల్ ఆలా'** అంటాం. ఇక్కడికి ఒక రకాతు నమాజ్ పూర్తయ్యింది. **అల్లాహు అక్బర్** అని రెండవ సజ్దా నుండి తల ఎత్తి నిటారుగా నిలుస్తాం.

ఈ విధంగా రెండవ రకాత్ నమాజ్ చేస్తాం. కాని రెండవ రకాతు ప్రారంభంలో **'అల్లాహుమ్మ', 'అవూజుబిల్లాహి'** చదవకుండా **'బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీం'**తో ప్రారంభం చేసి **'అల్‌హమ్ద్'** సూరా, రెండవ సూరా చదివాక, రుకూ, రెండు సజ్దాలు చేస్తాం. ఆపై నిటారుగా నిలిచే బదులు నిర్మలంగా కూర్చొని మెల్లమెల్లగా **'అత్తహియ్యాత్'** చదువుతాం. నాకూ అత్తహియ్యాత్ వస్తుంది. వినండి విన్పిస్తాను.

اَلتَّحِيَّاتُ لِلّٰهِ وَالصَّلَوٰتُ وَالطَّيِّبٰتُ اَلسَّلَامُ عَلَيْكَ اَيُّهَا
النَّبِيُّ وَرَحْمَةُ اللّٰهِ وَبَرَكَاتُهٗ اَلسَّلَامُ عَلَيْنَا وَعَلٰى عِبَادِ اللّٰهِ الصّٰلِحِيْنَ ○
اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَرَسُوْلُهٗ ○

**అత్తహియ్యాతు వస్సలవాతు వత్తయ్యిబాతు అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు వరహ్మతుల్లాహి వ బరకాతుహ్ అస్సలాము అలైనా వఅలా ఇబాదిల్లాహిస్సాలిహీన్ అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వరసూలుహ్.**

రెండే రకాతుల నమాజ్ అయితే అంటే ఫజర్ నమాజ్‌లో లాగా అత్తహియ్యాత్ చదివాక దరూదె షరీఫ్, దుఆ పఠిస్తాం. అవి ఇలా ఉన్నాయి.

اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ عَلٰٓى اِبْرَاهِيْمَ
وَعَلٰٓى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ
اَللّٰهُمَّ بَارِكْ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا بَارَكْتَ
عَلٰٓى اِبْرَاهِيْمَ وَعَلٰٓى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ

**అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమాసల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్ మజీద్**

**అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిన్ వ అలా ముహమ్మదిన్ కమాబారక్త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్ మజీద్**

సలామ్ చేసే విధానం ఏమిటంటే కూర్చొని, కుడివైపు ముఖం తిప్పి 'అస్సలాము అలైకుం వ రహ్మతుల్లాహ్' అంటాం. ఆపై ఎడమ వైపు ముఖం తిప్పి 'అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహ్' అంటాం. కాని జుహర్, అసర్, ఇషా లేదా మగ్రిబ్ నమాజుల్లో రెండు రకాతులు నమాజ్ చేశాక అత్తహియ్యాత్ చదివి అల్లాహు అక్బర్ అని లేచి నిలబడతాం. జుహర్, అసర్, ఇషా నమాజుల్లోని రెండు రకాతుల్లో, మగ్రిబ్ నమాజులోని మిగిలిన ఒక రకాత్‌లో బిస్మిల్లా తరువాత కేవలం అల్‌హమ్దు సూరా మాత్రమే చదవుతాం. రెండవ సూరా చదవం. రుకూ సజ్దాలు పూర్తి చేసుకుని అత్తహియ్యాత్, దరూద్ షరీఫ్, దుఆ చేసి కుడి ఎడమలకు ముఖం తిప్పి 'అస్సలాము అలైకుం వరహ్మతుల్లాహ్' అని అంటాం.

అత్తహియ్యాత్, దరూదె షరీఫ్ తరువాత చేసే దుఆ ఇలా వుంది :

اَللّٰهُمَّ اِنِّىْ ظَلَمْتُ نَفْسِىْ ظُلْمًا كَثِيْرًا وَّلَا يَغْفِرُ الذُّنُوْبَ اِلَّآ
اَنْتَ فَاغْفِرْ لِىْ مَغْفِرَةً مِّنْ عِنْدِكَ وَارْحَمْنِىْٓ اِنَّكَ اَنْتَ الْغَفُوْرُ الرَّحِيْمُ

**అల్లాహుమ్మ ఇన్నీ జలమ్తు నఫ్సీ జుల్‌మన్ కసీరన్ వలా యగ్‌ఫిరుజ్జునూబ ఇల్లా అన్త ఫగ్‌ఫిర్‌లీ మగ్‌ఫిర్‌తమ్ మిన్ ఇన్దిక వర్‌హమ్‌నీ ఇన్నక అన్తల్ గఫూరుర్రహీమ్**

సలాం చేశాక నిండు మనసుతో అల్లాహ్‌ను అర్థిస్తాం. ఫరజ్ నమాజ్ చేసే విధానం ఇది. ఈ విధానాన్ని మహాప్రవక్త(స) అల్లాహ్ ఆజ్ఞతో మనకు నేర్పారు. అనేక మతాల వారు తమ తమ ప్రార్థనా విధానాలను వారే నిర్ణయించుకొని పూజలు చేసుకొంటుంటారు. కాని అల్లాహ్‌కు నచ్చిన ఆరాధనా విధానం 'నమాజ్' ఒక్కటే. వేరే విధానాలంటే ఆయనకు గిట్టవు. అందుచేత అల్లాహ్ ఆజ్ఞ ప్రకారం మహాప్రవక్త ముహమ్మద్(స) నేర్పిన విధానాన్నే పాటిస్తూ అల్లాహ్‌నే ఆరాధిస్తాం.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. మనం ముఖాన్ని ఎటువైపు తిప్పి నమాజ్ చేస్తాం?
2. అజాన్, ఇఖామత్‌లో భేదం ఏమిటి?
3. 'తఅవ్వుజ్' అంటే ఏమిటి?
4. 'తస్మియా' అంటే ఏమిటి?
5. 'సమిఅల్లాహులిమన్ హమిదహ్'కు జవాబుగా ఏమని పలుకుతాం?

**(ఆ) ఈ క్రింది వాటిని జత చేయండి.**

| | అ | ఆ |
|---|---|---|
| 1. | ఇమామ్ సాహెబ్ | భుజానికి భుజం ఆనించి నించుంటారు |
| 2. | నమాజీలందరూ | సరి చేసుకుంటారు |
| 3. | పంక్తులు | ఇటు అటూ చూడరు |
| 4. | నమాజ్‌లో | అందరికంటే ముందు ఒంటరిగా నిలబడుతారు |
| 5. | ఖద్‌ఖామతిస్సలాహ్ | సుబ్‌హానరబ్బియల్ ఆలా |
| 6. | చేతులు కట్టుకునే విధానం | ఇఖామత్ చెప్పేటప్పుడు పలికే తక్బీర్ |
| 7. | 'అల్‌హమ్' సూరా పూర్తయిన తరువాత | కుడిచేయి కింద ఎడమ చేతిని కింద ఉంచుతారు |
| 8. | రుకూలో పలికే తస్బీహ్ | సుబ్‌హానరబ్బియత్ అజీమ్ |
| 9. | సజ్దాలో పలికే తస్బీహ్ | ఆమీన్ అంటారు |

**(ఇ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. నమాజ్ ఎలా ప్రారంభిస్తారు? ఎలా పూర్తి చేస్తారు?
2. ఏ వాక్యాలతో నమాజ్ పూర్తి చేస్తారు.

**ఈ) క్రింద కొన్ని వాక్యాలు ఇవ్వడం జరిగింది. సరైన వాటి ముందు 'ఒప్పు' అని, తప్పు వాక్యాల ముందు 'తప్పు' అని వ్రాయండి.**

1. రెండవ రకాత్‌లో 'సుబ్‌హానకల్లాహుమ్మ', 'అవూజుబిల్లాహ్' చదువుతారు ( )
2. రెండవ రకాత్‌లో సజ్దాలు చేసిన తరువాత లేచి నిలుచుంటారు ( )
3. దరూదె షరీఫ్‌కు ముందు అత్తహియ్యాతు పఠిస్తారు ( )

4. మొదట ఎడమ వైపు తరువాత కుడివైపు తిరిగి సలామ్ చెబుతారు ( )
5. మూడు లేదా నాలుగు రకాత్‌ల నమాజ్‌లో రెండు రకాతుల తరువాత సలామ్ పలికి తిరిగి లేచి నించుంటారు ( )
6. జొహర్, అస్ర్, ఇషా ఫరజ్ నమాజ్‌ల్లో నాలుగేసి రకాత్‌లు ఆచరిస్తారు ( )
7. మగ్రిబ్ నమాజ్‌లో రెండు రకాతులు ఫర్జ్ నమాజ్ చేస్తారు ( )
8. ఫర్జ్ నమాజ్ చేస్తున్నప్పుడు మూడు,నాలుగో రకాత్‌లలో ఫాతిహా సూరా తరువాత అదనపు సూరా పఠించరు ( )
9. దరూదె షరీఫ్ తరువాత దుఆ చదివిన వెంటనే నమాజ్ పూర్తవుతుంది ( )
10. ప్రియప్రవక్త(స) నమాజ్ చేసే విధానాన్ని నేర్పారు ( )
11. పూజా పురస్కారాల్లాంటి ఇతర పనులన్నీ తప్పుడు పద్ధతులు ( )

**ఉ) కింది వాక్యాలను జత చేయండి**

| | | |
|---|---|---|
| 1. | ఫజర్ | నాలుగు రకాత్‌లు ఫర్జ్ |
| 2. | జొహర్ | రెండు రకాత్‌లు ఫర్జ్ |
| 3. | అసర్ | మూడు రకాత్‌లు ఫర్జ్ |
| 4. | మగ్రిబ్ | నాలుగు రకాత్‌లు ఫర్జ్ |
| 5. | ఇషా | నాలుగు రకాత్‌లు ఫర్జ్ |

## చేయాల్సిన మరి కొన్ని పనులు

1. ఇఖామత్ చదివి వినిపించండి
2. సనా చదివి వినిపించండి
3. సూరె ఫాతిహా చదవండి
4. ఖుల్‌హు వల్లాహు, ఇన్నా ఆతైనా, వల్ అస్ర్ సూరాలు చదవండి
5. అత్తహియ్యాత్ వినిపించండి
6. దరూదె షరీఫ్ వినిపించండి
7. దరూదె షరీఫ్ తరువాత దుఆ చదివి వినిపించండి

# 14. మహాప్రవక్త (సఅసం)

భారతదేశానికి పశ్చిమాన అరబ్బు దేశం ఉంది. ఆ దేశంలో మక్కా ఒక విశిష్ట పట్టణం. ఆ పట్టణంలో పుట్టారు మన ఆత్మీయ ప్రవక్త ముహమ్మద్(స). మక్కా పట్టణంలో అల్లాహ్ ఆరాధన కోసం నిర్మించిన పవిత్ర గృహం ఉంది. అది 'కాబా' అని అనబడుతుంది. ముస్లింలు ఎక్కడున్నాసరే నమాజు కోసం నిలిస్తే కాబా వైపు ముఖం చేసి నిలబడతారు. 'కాబా'ను ముస్లింల ఖిబ్లా అని అంటారు.

ప్రపంచ నలుమూలల నుండి ముస్లిం ప్రజానీకం హజ్ చేయడానికి 'కాబా'కు వెళ్తారు. అల్లాహ్ ఆరాధన కోసం కాబా గృహాన్ని హజ్రత్ ఇబ్రాహీం (అలైహిస్సలాం), అతని ఆత్మీయ పుత్రుడు హజ్రత్ ఇస్మాయిల్ (అలైహిస్సలాం) నిర్మించారు. తండ్రి, తనయుడు అల్లాహ్ ప్రవక్తలే. మహాప్రవక్త ముహమ్మద్(స) వీరి సంతానంలోని వారే. అరబ్బు దేశంలో ఒక ప్రముఖ తెగ వారుండేవారు. ఆ తెగవారిని ఖురైష్‌లు అంటారు. ఖురైష్ తెగలో ఒక ఉన్నత కుటుంబం ఉండేది. ఆ కుటుంబం వారు 'హాషిం' వంశానికి చెందినవారు. ఈ వంశం వారు అరబ్బు దేశ సర్దారులు. మహాప్రవక్త(స) ఈ కుటుంబానికి చెందినవారే. తండ్రి పేరు హజ్రత్ అబ్దుల్లాహ్. తల్లి పేరు బీబీ ఆమిన. దాది హలిమా ముహమ్మద్(స)కు పాలిచ్చిన తల్లి. ఎవరూ నోచుకోని మహాభాగ్యం ఆమెకు దక్కింది. పసిబాలుడుగా ఉన్నప్పుడే ముహమ్మద్(స) అనాధ బాలుడయ్యారు. పుట్టక ముందు కొన్ని దినాల క్రితం తండ్రి పరమపదించారు. బాల్య దశ తీరకముందే తల్లి దివంగతులయ్యారు. తాతగారు బాలుని పెంచిపోషించారు. ఎనిమిది ఏండ్ల ప్రాయంలో తాత కూడా చనిపోయారు. పినతండ్రి అబూ తాలిబ్ ముహమ్మద్(స)ను పెంచి పెద్దచేశారు. తన ప్రాణం కన్నా మిన్నగా ముహమ్మద్(స)ను చూసుకొన్నారు. ముహమ్మద్(స) బాల్యం నుండే మంచివారు. చెడు మాటల నుండి, చెడ్డ పనుల నుండి దూరంగా ఉండేవారు. సత్యం పలుకడం ఆయన నైజం. అందుచేతనే అందరూ ఆయన్ని 'సాదిఖ్' (సత్యసంధుడు) అని పిలిచేవారు. ఆయన మాటంటే అందరూ నమ్మేవారు. ఇంకా ముహమ్మద్(స) అమానతుదారుడుగా పేరుపొందారు. అందరూ ఆయన్ని 'అమీన్' (నమ్మకస్తుడు) అని పిలిచేవారు. అందరికీ ఈయన మీద భరోసా ఉండేది. ఎల్లప్పుడూ ప్రజల మేలు కోరేవారు. అందరూ ఆయన్ను గౌరవించేవారు. ఆయనంటే అందరికీ అభిమానం. ఇక యవ్వన దశ వచ్చింది. బీబీ ఖదీజా (రజి)తో వివాహమయింది. ఆమె సుగుణాల రాశి. ముహమ్మద్(స)ను ఆమె ఎంతో ప్రేమతో కంటికి రెప్పలా చూసుకొనేవారు. ముహమ్మద్(స)కూడా ఆమెను ఎంతో దయతో చూసేవారు. నిండా నలువది ఏండ్ల ప్రాయం వచ్చింది. అల్లాహ్ ఆయన్ను తన ప్రవక్త(స) గా చేశాడు. ఆయనపై దివ్యఖుర్‌ఆన్ అవతరింపజేశాడు. అపార కరుణతో అల్లాహ్ ఖుర్‌ఆన్ గ్రంథాన్ని మానవుల కోసం పంపాడు. మహాప్రవక్త ముహమ్మద్(స) మంచి పనులు చేసి చూపించేవారు. అల్లాహ్ ఆజ్ఞల్ని అనుసరించి ఆదర్శంగా ఉండేవారు. దైవమిచ్చిన ఉద్గ్రంథం బోధనల్ని మానవులందరి వరకు చేర్చారు. ప్రజలలోని మంచివారు ఆ ప్రబోధనల్ని అంగీకరించారు. అల్లాహ్ ప్రవక్త పట్ల విశ్వాసం కలిగిన

వారు ఆయనకు సహచరులుగా జీవితం గడిపారు. వీరు ముస్లిములనబడ్డారు. ఆ సమాజంలో చెడ్డవారు కూడా ఉన్నారు. మహాప్రవక్త ప్రచారం చేసే సత్యధర్మాన్ని ఎదురించి నిలిచారు. వారు దైవప్రవక్త(స)కు వ్యతిరేకులయ్యారు. నిరాకరణోద్యమం తలపెట్టారు. కనబడిన చోట ఆయన్ను వేధించసాగారు.

వీరు కాఫిర్లు (సత్య తిరస్కారులు) అని పిలువబడ్డారు. కాఫిర్లు మహాప్రవక్తను, ఆయన అనుచరుల్ని బాధించి హింసించారు. తిట్టారు, కొట్టారు. ఇండ్ల నుంచి గెంటారు. మహా పురుషులు ప్రజలపై ప్రతీకారానికి పూనుకోరు కదా! మహాప్రవక్త, శాంతి కాముకులైన ఆయన అనుచరులు సత్య తిరస్కారులు పెట్టిన బాధలను సహనంతో భరించారు. మంచి మంచి ప్రబోధనల్ని ప్రజలకు విన్పించారు. ఎడతెగకుండా దైవధర్మాన్ని ప్రచారం చేశారు. చివరకు దైవసహాయం లభించింది. సత్య తిరస్కారుల బెడద అంతమయింది. అరబ్బు దేశంలో ఇస్లాం వ్యాపించింది. అడుగడుగునా ఇస్లామీయ జీవిత విధానం కంటికి కొట్టొచ్చినట్లు కనబడసాగింది.

మహాప్రవక్త ముహమ్మద్(స)పై శాంతి కలుగుగాక!

**అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదన్ వ బారిక్ వ సల్లిం**

اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰۤى اٰلِ مُحَمَّدٍ وَّ بَارِكْ وَسَلِّمْ -

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. ముస్లిములు హజ్ చేయడానికి ఎక్కడికి వెళతారు?
2. కాబాను ఎవరు నిర్మించారు?
3. ప్రియ ప్రవక్త(స) వంశం పేరేమిటి?
4. ప్రియ ప్రవక్త(స) తల్లిదండ్రుల పేర్లు తెలపండి?
5. ప్రియ ప్రవక్త(స) బాల్యంలో ఎలా ఉండేవారు?
6. మక్కావాసులు ఎవరిని 'సాదిక్', 'అమీన్' అని పిలిచేవారు?
7. బీబీ ఖదీజా(రజిఅ) ఎలాంటి వారు?
8. అల్లాహ్‌ను, ప్రవక్తను విశ్వసించేవారిని ఏమంటారు?
9. అల్లాహ్, ఆయన ప్రవక్త శత్రువులను ఏమంటారు?

**(ఆ) ఈ క్రింద ఇవ్వబడిన ప్రశ్నలకు సరైన సమాధానాలను ఎంచుకోండి**

1. మన దేశానికి అరబ్ దేశం ఏ దిక్కున ఉంది?
(పశ్చిమాన, ఉత్తరాన, దక్షిణాన)

2. అరబ్ దేశంలోని విశిష్ట నగరం ఏది?
(బాగ్దాద్, మక్కా, కాబుల్)
3. మనం ఎటువైపు తిరిగి నమాజ్ చేస్తాం?
(కాబా, మదీనా, మస్జిద్)
4. కాబా ఎవరికి ఖిబ్లా?
(ముస్లిములకు, యూదులకు, క్రైస్తవులకు)
5. అల్లాహ్ ముహమ్మద్(స)ను ప్రవక్తగా ఎన్నుకున్నప్పుడు ఆయన వయస్సు ఎంత?
(25 సం॥, 40 సం॥, 63సం॥)

**(ఇ) క్రింది వాటిని జత చేయండి**

| | అ | ఆ |
|---|---|---|
| 1. | హజ్రత్ ఇబ్రాహీం | పాలిచ్చిన తల్లి |
| 2. | దాయీ హలీమ | ప్రవక్త(స) బాబాయి |
| 3. | అబూ తాలిబ్ | హజ్రత్ ఇస్మాయీల్(అ) |
| 4. | దైవగ్రంథం | అల్లాహుమ్మ సల్లిఅలా ముహమ్మదిన్వఅలా ఆలిముహమ్మదిన్ వబారిక్ వసల్లమ్ |
| 5. | దరూద్ సలామ్ | దైవ గృహం |
| 6. | కాబా | ఖుర్ఆన్ |



# 15. మహాప్రవక్త ముహమ్మద్(స) సహచరులు

మహాప్రవక్త ముహమ్మద్(స)ను అనుసరించి ఆయనతో ఉన్న వారిని 'సహాబా' అంటారు. మహాప్రవక్త(స) మానవులందరిలో శ్రేష్ఠ పురుషులుగా ఉన్నారు. ఆయన సహచరులు ఉత్తమోత్తమ వ్యక్తులుగా జీవితం గడిపారు. ఈ సహచరులు ప్రవక్త(స)ను తమ ప్రాణాలకంటే మిన్నగా ప్రేమించేవారు. తమ తల్లిదండ్రుల కంటే ఎక్కువగా చూసుకునేవారు. ఆయన సంజ్ఞ అందితే చాలు ప్రాణత్యాగం చేయడానికి సిద్ధపడేవారు. అలా తయారవడానికి కారణం? వారికి మంచి మంచి మాటలు ప్రబోధించారు మహాప్రవక్త(స). అందరూ మెచ్చుకొనే సన్మార్గాన్ని చూపించారు. ఆ మార్గంలోనే వారి జీవితాలు మలచబడ్డాయి. నేర్చిన ధర్మం ఇతరుల వరకు 'సహాబా'లు చేర్చేవారు. ఏ పనులు చేస్తే దైవం, దైవప్రవక్త మమ్మల్ని మెచ్చుకొంటారు అన్నదొక్కటే వారి ధ్యాస. దైవమార్గంలో వారికి కలిగిన కష్టాలు, పడినపాట్లు అన్నీ ఇన్నీ కాదు. ఏది ఏమైనప్పటికీ దైవమార్గంలో ఏ త్యాగమైన చేసేందుకు సిద్ధమయ్యేవారు. సత్యధర్మ ప్రచారానికి వారు తమ శక్తిని ధారపోశారు. ఈ మార్గంలో వారు వేధించబడ్డారు, వధించబడ్డారు. అన్నిటినీ వారు భరించారు. అల్లాహ్ పట్ల నిత్యం కృతజ్ఞత తెలిపారు.

అల్లాహ్‌తో వారు సంతోషపడ్డారు. వారంటే అల్లాహ్ కూడా సంతోషపడ్డాడు. ఈ మహా పురుషుల జీవితాలలో మనకెంతో ఆదర్శం ఉంది. వీరి జీవిత చరిత్రల్ని చదివితే మనం ప్రపంచంలో ఉన్నంతవరకు ఎలా ఉండాలనేది బాగా బోధపడుతుంది.

మహాప్రవక్త సహచరులు అనేకులున్నారు. ఒకరిని మించిన వారొకరు. ఒకప్పుడు వారిని గురించి మహాప్రవక్త ముహమ్మద్(స) ఇలా అన్నారు : "నా సహచరులు నక్షత్రాల్లా ఉన్నారు.వారిననుసరిస్తే సన్మార్గం పొందుతారు." ఏవిధంగా రాత్రుల్లో నక్షత్రాల్ని చూస్తూ గమ్యం చేరడానికి మార్గం తెలుసుకొంటామో అలాగే మహాప్రవక్త సహచరుల్ని అనుసరిస్తే విజయవంతంగా జీవితం గడిపే మార్గం పొందగలం.

మనందరికీ ఆత్మీయులైన మహాప్రవక్త (స) సహచరుల్లో కొంతమంది అగ్రశ్రేణికి చెందినవారు. వారికి అల్లాహ్ వారి జీవిత కాలంలోనే స్వర్గ ప్రవేశపు శుభవార్తను తెలిపాడు. ఈ సహాబాలు మహాప్రవక్తకు ఎంత చేరువగా ఉంటూ స్తోమతనుబట్టి లాభపడేవారు. ఇతరులకు ఆ లాభాన్ని పంచిపెట్టేవారు. హజ్రత్ అబూబకర్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి), హజ్రత్ ఉస్మాన్(రజి), హజ్రత్ అలీ(రజి), మహాప్రవక్త సతీమణులు హజ్రత్ ఖదీజా(రజి), హజ్రత్ ఆయెషా(రజి) ఇంకా మహాప్రవక్త ప్రియమైన కుమార్తె హజ్రత్ ఫాతిమా(రజి), ఆమె కుమారులు హజ్రత్ హసన్(రజి), హజ్రత్ హుసైన్(రజి) ఇంకా ఆయన సేవలో గడిపిన హజ్రత్ జైద్(రజి), హజ్రత్ బిలాల్ (రజి) సుప్రసిద్ధ సహాబాలు. అల్లాహ్ వారందరినీ తన సాన్నిధ్యంలో చోటిచ్చి సుఖంగా ఉంచుగాక! మహాప్రవక్త సహచరులు మనకెంతో మేలు చేశారు. వారి జీవిత గాథలు వింటూ చదువుతూ మనమూ వారిలో మారడానికి ప్రయత్నం చేయాలి.

వారిననుసరిస్తూ జీవించడానికి అల్లాహ్ మనల్ని అనుగ్రహించుగాక!

## అభ్యాసం

**అ) క్రింద కొన్ని వాక్యాలు ఇవ్వడం జరిగింది. వాటిలో సహాబాలకు సంబంధించిన వాక్యాల కింద గీత గీయండి**

సహాబాలు చాలా మంచివారు. ప్రవక్త(స) కోసం ప్రాణత్యాగానికైనా సిద్ధమయ్యేవారు. ఎప్పుడూ సుఖంగా కూర్చునేవారు. మంచి విషయాలు, మంచి విధానాలు నేర్చుకునేవారు. వాళ్ళే ఆచరించుకునేవారు. అల్లాహ్, ప్రవక్త(స)ను సంతోషపెట్టాలనుకునేవారు. వారు చాలా కొద్ది మంది మాత్రమే. ప్రవక్త(స) నేర్చుకుని, ఇతరులకు నేర్పేవారు. వారు మాకు ఎంతో ఉపకారం చేశారు. అల్లాహ్ ధర్మాన్ని వ్యాపింపజేయడానికి ఎంతో కృషి చేశారు.

**ఆ) ఈ క్రింద చంద్రుని గుర్తులో ప్రవక్త(స) పేరు ఉంది. దాని కింద ఉన్న నక్షత్రాల్లో ఒక సహాబీ పేరుంది. మిగతా నక్షత్రాల్లో ఇతర సహాబీల పేర్లు వ్రాయండి.**




**(ఇ) క్రింది వాటిని జత చేయండి**

| అ | ఆ |
|---|---|
| 1. సహాబి | 1. హజ్రత్ ఫాతిమా (రజి) |
| 2. కూతురు | 2. ప్రవక్త(స) మిత్రులు |
| 3. మనవలు | 3. హజ్రత్ ఖదీజా(రజి) |
| 4. భార్య | 4. హజ్రత్ హసన్, హజ్రత్ హుసేన్ (రజిఅన్హుమ్) |

# 16. మంచి అబ్బాయిలు

మహాప్రవక్త సహచరులు అందరు చాలా మంచివారు. ఆ కాలంలో చిన్న అబ్బాయిలు కూడా ధైర్యసాహసాలు చూపేవారు. మహాప్రవక్త(స) అంటే వారికెంతో ప్రీతి. వారిలో కొందరి జీవిత గాథలు తెలుసుకొందాం.

## 1. మహాప్రవక్త(స) పట్ల ప్రగాఢ ప్రేమ గల అబ్బాయి

ఒక చిన్న అబ్బాయి ఉండేవాడు. ఆ అబ్బాయి పేరు జైద్. కొందరు దుండగులు ఆ అబ్బాయిని బందీ చేశారు. మక్కా పట్టణం తెచ్చారు. ఇస్లాం అవతరణకు ముందు మక్కాలో బానిసల వ్యాపారం ఉండేది. నడిబజారులో ఆ బంధితుణ్ణి విక్రయించారు. మహాప్రవక్త ముహమ్మద్(స) సతీమణి హజ్రత్ ఖదీజా(రజి) గారికి ఈ విషయం తెలిసింది. ఆ బాలుని కొని మహాప్రవక్త(స) గారికి సమర్పించారు.

మహాప్రవక్త ముహమ్మద్(స)కు చిన్న పిల్లలంటే ఎంతో ప్రేమ. బానిసగా వచ్చిన ఆ బాలుని మహాప్రవక్త మరింత ఆప్యాయతతో చూడసాగారు. తల్లిదండ్రుల నుండి దూరమైన బాలుడు కావడంచేత ఆయనే ఆ బాలునికి సమస్తమయ్యారు. అల్లారు ముద్దుగా పెంచసాగారు. మంచి మంచి మాటలు నేర్పించారు. బాలుని హృదయాన్ని ఆకట్టుకున్నారు. జైద్ ఎప్పుడు ప్రవక్త వెంట ఉంటూ ఆయన సేవ చేస్తూ వచ్చారు.

ఇలా కొన్ని దినాలు గడిచాయి. అబ్బాయిని పోగొట్టుకున్న తండ్రి వెతుక్కుంటూ, వెతుక్కొంటూ మక్కా పట్టణం చేరాడు. మహాప్రవక్త ముహమ్మద్ సమక్షంలో హాజరయ్యాడు. తనకు దూరమైన తన తనయుణ్ణి ఇవ్వమని అర్థించాడు. మహాప్రవక్త బాలుని బానిసత్వం నుండి విముక్తి పరిచారు. కాని ఆ బానిస మహాప్రవక్తను వదిలి వెళ్లడానికి ఒప్పుకోలేదు. స్వంత ఇంటికన్న సంరక్షకుని ఇల్లే సంతోష నిలయంగా అగుపించింది అతనికి. మహాప్రవక్తను వదిలి వెళ్ళడానికి ఇష్టపడలేదు. పాపం పసికందును తీసుకొని వెళ్దామని ఎంతో ఆత్రుతతో వచ్చిన తండ్రి ముగ్ధుడయ్యాడు. అతణ్ణి వదిలి తనతో రావడానికి ఏమాత్రం ఇష్టపడని తనయుని చూస్తూ ఆ అబ్బాయిని అక్కడే వదిలి వెళ్లడానికి రాజీపడ్డాడు. తల్లిదండ్రుల్ని మించిన ఆత్మీయత మహాప్రవక్తలో అగుపించిందా బాలునికి. మహాప్రవక్త సాంగత్యంలోనే ఉండిపోయాడు. నేడు కూడా హజ్రత్ జైద్ పేరు ఎంతో గౌరవంతో తీసుకుంటారు ముస్లింలు.

## 2. దైవధర్మం కోసం ప్రాణాన్నిచ్చేందుకు సిద్ధం

మహాప్రవక్త ముహమ్మద్(స) పూర్తి ప్రపంచానికి కారుణ్యమూర్తిగా వచ్చారు. ఆయన ప్రజా సంబంధాలు ఎడతెగని అనుబంధాలు. మంచిని పెంచమని ఆదేశించేవారు, చెడు నుంచి దూరంగా ఉండమని కోరేవారు. మంచివారు ఈ విషయంలో జాగ్రత్త తీసుకొన్నారు. చెడ్డవారు వ్యతిరేకులయ్యారు. ప్రాణ శత్రువులయ్యారు. కయ్యానికి కాలు దువ్వారు. మహాప్రవక్త(స), ఆయన సహచరులపై విజృంభించారు. యుద్ధం చేయడానికి రణరంగం వచ్చారు. మహాప్రవక్త (స), ఆయన సహచరులు దైవమార్గంలో ధర్మయుద్ధానికి నడుం కట్టారు. ఇంకా యవ్వనానికి రాని బాలురు కూడా అవిశ్వాసులతో

యుద్ధం చేయడానికి సైన్యంలో చేరడానికి అనుమతి అడిగారు. కాని ఎలా తీసుకొంటారు వారిని. లేత వయసు గల వారిని దారిలోనే వాపసు చేయడం అయింది.

వారిలో 'రాఫే' ఒక పిల్లవాడు. వరుసలు తీరి నిలుచున్న సాహస యువకుల్లో తాను నిలిచాడు. ఎత్తుగ అగుపించాలని అరికాళ్ళ మీద నిలుచున్నాడు. సైన్యంలో చేరడానికి ఆ అబ్బాయి ప్రదర్శించిన ఉత్సాహం మహాప్రవక్త(స)కు నచ్చింది. సైన్యంలో అతణ్ణి చేర్చుకొన్నారు.

ఇంకో బాలుడు 'సమరహ్' కాదంటే కాదు, నేను సైన్యంలో చేరతానని పట్టుపట్టాడు. రాఫెను మీరు చేర్చుకొన్నారు కదా, నేను అతణ్ణి మల్లయుద్ధంలో చిత్తు చేస్తాను. నన్ను సైన్యంలో చేర్చుకోండి అని అన్నాడు. ఆ బాలురిద్దరికి కుస్తీ ఏర్పాటయింది. నిజంగా సమర,రాఫేను చిత్తు చేశాడు. సైన్యంలో చేరే భాగ్యానికి నోచుకొన్నాడు. సంతోషంతో వారువురు యోధులుగా ముస్లిం సైన్యంలో చేరారు, కాఫిర్లతో యుద్ధం చేయడానికి వెళ్ళారు.

**3. రహస్యాన్ని గుప్తంగా కాపాడాలి**

హజ్రత్ అనస్(రజి) ఒక ప్రఖ్యాత 'సహాబి' బాల్యం నుండే సత్ప్రవర్తన కలవారు. ఒక దినం అతను ఇతర బాలురతో ఆటాడుతున్నారు. మహాప్రవక్త ముహమ్మద్(స) అటునుంచి రానే వచ్చారు. పిల్లవాళ్ళందరికి సలాం చేశారు. హజ్రత్ అనస్(రజి)ను పిలిచారు, ముద్దాడి ఒక పనిపై పంపించారు. చెప్పిన పని చేసి రావడానికి ఆలస్యం అయింది. దైవమార్గంలో చేసే పనులు శ్రద్ధాసక్తులతో చేయాలి కదా!

ఇంటికి వెళ్ళగానే అమ్మవారు అడిగారు - 'అనస్ (రజి) నీవింతసేపు ఎక్కడున్నావు?'

'అమ్మా, ఆత్మీయులైన మహాప్రవక్త(స) నాకొక పని మీది పంపారు.'

'అదేమి పని నాయనా?'

'అదొక రహస్యమమ్మా'

'చూడు నాయనా! మహాప్రవక్త రహస్యం మరొకరికి చెప్పకూడదు సుమా!' అని అన్నారు అమ్మగారు.

అమ్మ చెప్పింది హజ్రత్ అనస్(రజి)కు నచ్చింది. జీవితాంతం వరకు ఆ రహస్యం, మరొకరికి చెప్పలేదు. హజ్రత్ సాజిత్(రజి) హజ్రత్ అనస్(రజి)కు ప్రాణమిత్రుడు. ఆయనకు కూడా రహస్యాన్ని తెలుపలేదు. 'రహస్యం' గుప్తంగానే పెట్టి ఒకసారి సాజిత్ (రజి) గారితో ఇలా అన్నారు. 'ఈ రహస్య ప్రస్తావన మరెవరితోనైనా చేసి ఉంటే ఓ సాజిత్ ఈ రహస్యం నీకు తప్పక తెలిపి ఉండేవాణ్ణి' అని.

## అభ్యాసం

**అ) క్రింద ఒకవైపు ప్రవక్త(స) కాలంలోని కొందరు పిల్లల పేర్లు ఇవ్వబడ్డాయి. మరోవైపు వారికి సంబంధించిన కొన్ని విషయాలు పేర్కొనడం జరిగింది. గీతల సహాయంతో వాటిని గుర్తించండి.**

| | |
|---|---|
| 1. హ॒జ్రత్ జైద్ (రజి) | జిహాద్ కోసం కాలి మునివేళ్ళ మీద లేచి నిల్చున్నారు. |
| 2. హ॒జ్రత్ రాఫె (రజి) | హ॒జ్రత్ అనస్(రజి) కూడా ఈయనకు రహస్యం తెలుపలేదు. |
| 3. హ॒జ్రత్ సమర (రజి) | ప్రియప్రవక్త(స) ఆయనకు ఒక పని అప్పజెప్పారు. |
| 4. హ॒జ్రత్ అనస్ (రజి) | ఈయన రాఫెను చిత్తు చేశారు. |
| 5. హ॒జ్రత్ సాబిత్ (రజి) | ప్రవక్త(స)ను ఎంతగా ప్రేమించారంటే ఆయన ప్రవక్తను వదలడానికి సిద్ధం కాలేదు. |

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. ప్రవక్త కాలంలో పిల్లలు ధైర్యం............ చూపేవారు
2. ప్రవక్త(స) ............... ను అమితంగా ప్రేమించేవారు.
3. ప్రవక్త(స) మానవులందరి కోసం ............. గా చేసి పంపబడ్డారు.
4. ప్రవక్త(స) మంచిపనులను ఆదేశించేవారు ............ నుంచి వారించేవారు.

**(ఇ) క్రింద పేర్కొన్న వాక్యాలు ఎవరన్నారో వారి పేర్లు ప్రక్కన రాయండి**

1. 'నేను రాఫెను చిత్తు చేశాను. నన్ను సైన్యంలో చేర్చుకోండి'
2. 'మహాప్రవక్త రహస్యం మరొకరికి చెప్పకూడదు'
3. 'సాబిత్! ఒకవేళ నేను ఈ రహస్యాన్ని మరెవరితోనైనా తెలిసి వుంటే నీకు తప్పక తెలిపి ఉండేవాణ్ణి'



# 17. ప్రవక్తల గాధలు

మహాప్రవక్త ముహమ్మద్(స) ప్రవక్తల వరుసలో చివరివారు. ఆయనకంటే ముందు ప్రపంచంలో అనేక ప్రవక్తలు ప్రభవించబడ్డారు. అల్లాహ్ పంపిన ప్రవక్తలందరు సత్యసంధులు, ఆదర్శవంతులు. చెడుకు దూరంగా ఉండేవారు. మానవుల్లో మంచిని పెంచేవారు. అందరు దైవోపదేశాన్ని ప్రజలకం దించారు. రుజుమార్గం చూపారు, దైవాజ్ఞల్ని వినిపించారు.

ఆ ఆజ్ఞల్ని వారు పాటించారు. దైవాభీష్టాన్ననుసరించారు. పుణ్యపనులు చెయ్యమని చెప్పారు. పాపపు పనులు చెయ్యకుండా ప్రజల్ని ఆపారు. మన సమాజంలో కనబడే నైతికవిలువలు ఈ మహా పురుషులు చేసిన కృషి ఫలితమే.

ఎందరు ప్రవక్తలు పుడమిపై పాదం మోపారో చెప్పలేము. వారి సంఖ్య అల్లాహ్‌కే తెలుసు. వారిలో కొందరి గాధలు సంక్షిప్తంగా తెలియజేస్తున్నాం.

## హజ్రత్ ఆదం(అలైహిస్సలాం)

ప్రప్రథమ ప్రవక్త ఆదం(అలైహి). ప్రపంచంలో సృష్టించబడ్డ మొదటి మనిషి కూడా ఆయనే. మనమంతా ఆది మానవుడైన ఆదం(అలైహి) సంతానమే. ఆ తాత తనయులే ఈనాటి మానవాళి ఆదం(అలైహి) సంతానానికి చెందడం వల్లనే మనిషి 'ఆదమి' అని పిలవబడుతున్నాడు.

ఆదం(అలైహి)ను అల్లాహ్ మట్టితో చేశాడు. మనమందరం మట్టితో చేయబడ్డవారమే. ఆదంను మట్టితో చేశాక అతని శరీరంలో అల్లాహ్ ప్రాణం పోశాడు. ప్రాణంతో ఉంటూ ఆదం(అలైహి) నడవడం, తిరగడం మొదలెట్టారు. మాట ముచ్చట చేస్తూ వచ్చారు. అల్లాహ్ ఆయనకు చదవటం నేర్పించాడు, నడవడిక, ప్రవర్తనల్ని ప్రబోధించాడు. చదువుసంధ్యతోపాటు జ్ఞానం ఇచ్చాడు. దైవదూతలకు మించిన గౌరవ స్థానమిచ్చాడు. భూమిపై తన ప్రతినిధిగా చేశాడు. ప్రపంచ యాజమాన్యం అతని చేతకిచ్చాడు. దైవదూతలకు ఇలా ఆజ్ఞ ఇచ్చాడు : 'మీరందరూ ఆదం ఎదుట తలవంచండి, ఆయనకు సజ్దా చేయండి.' అందరూ ఆజ్ఞను శిరసావహించారు. కాని షైతాన్ నిరాకరించాడు. వాడు జిన్నులలోని వాడు. దైవదూత కాదు. జిన్ను అగ్నిచేత చేయబడ్డాడు. షైతాన్ కూడా నిప్పుతో చేయబడ్డవాడే. గర్వపడి ఇలా అన్నాడు : 'నేను నిప్పుతో చేయబడ్డాను. ఆదం(అలైహి) మట్టితో చేయబడ్డాడు. అందుచేత నేను ఆదం కంటే ఎక్కువ ఔన్నత్యం కలవాణ్ణి. ఆదంకు సజ్దా చేయమంటే నేనెలా చేయను.' షైతాన్ గర్వపడి అల్లాహ్ ఆజ్ఞను తిరస్కరించాడు. అల్లాహ్ కోపానికి పాలయ్యాడు. స్వర్గం నుండి బహిష్కరించబడ్డాడు. షైతాన్ భ్రష్టుడై శాశ్వతంగా ఛీత్కరించబడ్డాడు. ఇక తాత ఆదం (అలైహి) గారికి అల్లాహ్ హవ్వా (అలైహి)ను సృష్టించి వివాహం చేశాడు. ఇద్దరూ స్వర్గంలో నివసిస్తున్నారు. స్వేచ్ఛగా తిరుగుతూ, కావలసింది తింటు న్నారు. ప్రభువును స్తుతిస్తున్నారు. అయితే ఆ స్వర్గంలో ఒక చెట్టు వుంది. దానిని సమీపించరాదని అల్లాహ్ వారిద్దరికీ నిషేధాజ్ఞ ఇచ్చాడు. ఒకరోజు ఇబ్లీసు వచ్చి ఇద్దరినీ మాటల మోసంలో పడేశాడు.

ఎట్లో అట్లు చేసి నిషేధించిన చెట్టు పండును తినిపించాడు. ఇక వారిద్దరూ నిషేదాజ్ఞను ఉల్లంఘించారు. అది చూసి అల్లాహ్‌కు వారి పట్ల అయిష్టత కలిగింది. ఇద్దరినీ స్వర్గం నుండి తొలగిపోండని ఆజ్ఞాపించాడు. వెంటనే ఆలుమగలిద్దరూ చేసిన తప్పును గ్రహించి ఏడ్చారు. పశ్చాత్తాపపడ్డారు. ఇకపై ఆజ్ఞోల్లంఘన చేయములని, తమ పట్ల కరుణించి, తమను క్షమించమని ప్రాధేయపడ్డారు. అల్లాహ్ అమితంగా అనుగ్రహించేవాడు. ఇద్దరినీ క్షమించాడు. ఆపై జీవితమంతా దైవాజ్ఞకు లోబడి గడిపారు. వారిద్దరికీ పుట్టెడు సంతానం కలిగింది. కాలక్రమేణా ఆ సంతానం మరింత వ్యాప్తిలోనికి వచ్చింది. ప్రపంచ నలుమూలల్లో వ్యాపించి వారందరూ తమ సంతానానికి మంచి మంచి మాటలు నేర్పించారు. దైవం అభిలషించే పనులు చెప్పారు. ఎన్నో ఏండ్లు గడిచిన తరువాత ఆదం, హవ్వా (అలైహి) ప్రపంచాన్ని వదిలివెళ్ళారు.

ఆదం, హవ్వా (అలైహి)లకు శాంతి కలుగుగాక!

అబ్బాయిలు, అమ్మాయిలూ మానవ చరిత్ర ప్రారంభం విన్నాక మనం ఎన్నో విషయాలు తెలుసుకుంటున్నాం.

మొదటిది, మనమందరం అంటే స్వర్గ మానవాళి మన తాత ఆదం (అలైహి) సంతానం. దైవదూతలు కూడా అల్లాహ్ ఆజ్ఞననుసరించి ఆదం (అ) ఎదుట సాష్టాంగపడ్డారు. అందుచేత మనమొక విశిష్ట స్థానం కలవారం. మనం అల్లాహ్ ప్రతినిధులం కూడా. సృష్టిరాశులన్నింటిలో గొప్పవారం. అందుచేత ఎవరి ఎదుటనూ తలవంచి సాష్టాంగ ప్రమాణం చేయరాదు. కేవలం అల్లాహ్‌కు చేయాలి. దేవతలకు, చెట్టుపుట్టలకు, నదీ నదాలకు, పశుపక్ష్యాదులకు, స్వహస్తాలతో చేసిన విగ్రహాలకు, మనలాంటి మానవులకు, దివంగతుల ఎదుట శిరసు వంచి ప్రణమిల్లడం అంటే స్వయంగా మనంతట మనం హీనులు కావటమే. ఫలితంగా మనం దైవాగ్రహానికి గురికావటం జరుగుతుంది.

రెండవది, ఈ ప్రపంచంలోని మానవులందరూ ఏ జాతికి, వంశానికి, తెగకు చెందినవారైనా సరే అందరూ ఒకే తల్లిదండ్రుల సంతానం. పరస్పరం సోదరులం, సమానులం కూడా. జాతి, మతం, నిమ్నోన్నతా భావాలు అన్నీ స్వయం కల్పితాలు. సయ్యదులూ, బ్రాహ్మణులు, భంగీలు, మాల మాదిగలు అందరూ ప్రథమ ప్రవక్త ఆదం(అ) సంతానమే. అందరూ గౌరవనీయులే. ఇక ఎవరైనా చెడుమార్గాన్ని అవలంభించి ఇటు దైవానికి, అటు ప్రజలకు అల్పులైతే అది చేతులారా తెచ్చుకొన్న ఖర్మయే.

మూడవది, షైతాన్ నిరంతరం మనల్ని వెంటాడుతూనే వుంటాడు. అవకాశాన్ని చూసి ఓదార్చి, బుజ్జగించి, లాలించి చెడుచేయటానికి పురిగొల్పుతాడు. మన పట్ల అల్లాహ్ ఆగ్రహించాలన్నదే అతని ధ్యేయం. ఒకసారి మిత్రుని రూపంలో వచ్చి, మంచి మంచి మాటలతో మభ్యపెడతాడు. మరొకప్పుడు మనసులో చేరి చెడు తలంపులు రేకెత్తించి తలవంపులు తెస్తాడు. షైతాన్ మనిషికి బహిరంగ శత్రువు. వీడితో జాగ్రత్తగా ఉండాలి.

నాలుగవది, తెలియక లేదా షైతాన్ వలలో చిక్కి ఎప్పుడైనా, ఏదైనా తప్పు చేస్తే ఆ తప్పును తెలుసుకొన్న వెంటనే ఆ పని చేసినందుకు సిగ్గుపడాలి. అల్లాహ్‌ను ప్రాధేయపడి క్షమాపణ కోరాలి. ఇక ముందు అలాంటి చెడు పనుల దరిదాపులకు పోనని ప్రతిజ్ఞ చేయాలి. దానికి కట్టుబడి ఉండాలి. చేసిన

తప్పును తెలుసుకున్న తర్వాత కూడా క్షమాపణ వేడుకోకపోవటం షైతాన్ స్వభావం అవుతుంది. అల్లాహ్ మనల్ని కాపాడుగాక!

ఐదవది, గర్వం తలవంపును తెచ్చి పెడుతుంది. ఇబ్లీసు అహంకారంతో అగ్నితో చేయబడ్డానని గర్వించాడు. అల్లాహ్ ఇచ్చిన ఆజ్ఞను కూడా ఉల్లంఘించాడు. ఆదం(అ) ఎదుట సాష్టాంగపడలేదు. తత్ఫలితంగా ఎల్లప్పటికీ ధూత్కరించబడ్డాడు. అందరూ అతన్ని శపిస్తారు.

## అభ్యాసం

**(అ) ఖాళీలు పూరించండి**

1. మన సమాజంలో కనబడే ................ ఈ మహా పురుషులు చేసిన కృషి ఫలితమే.
2. ప్రప్రథమ ప్రవక్త ............ (అలైహి)
3. మనమందరం ....................తో చేయబడ్డవారమే.
4. మానవులందరూ ఒకే తల్లిదండ్రితో ..................
5. షైతాన్ నిరంతరం ............ వెంటాడుతూనే ఉంటాడు.
6. తప్పును తెలుసుకున్న తర్వాత కూడా క్షమాపణ వేడుకోకపోవడం .............. స్వభావం అవుతుంది.
7. గర్వం ...................... తెచ్చిపెడుతుంది.
8. ఆదం (అలైహి)ను అల్లాహ్ ........................తో చేశాడు.

**(ఆ) క్రింద కొన్ని వాక్యాలు ఉన్నాయి. వాటిలో ఆదమ్ (అ) చెందిన విషయాల ముందు 'ఆ' అని, షైతాన్‌కు చెందిన విషయాల ముందు 'షై' అని వ్రాయండి.**

1. దైవదూతలు అల్లాహ్ ఆదేశం మేరకు సాష్టాంగపడ్డారు .............................
2. అల్లాహ్ అగ్నితో పుట్టించాడు ............................
3. భూమిపై అల్లాహ్ తన ప్రతినిధిగా ఎంచుకున్నాడు .............................
4. అహంతో అల్లాహ్ ఆదేశాన్ని శిరసావహించలేదు .............................
5. హవ్వా (అ) ఈయన్ను వివాహమాడారు .............................
6. జ్ఞానం లభించింది, గౌరవం లభించింది, నడవడి నేర్చుకున్నారు .............................
7. మొదటి ప్రవక్త, మొదటి మానవుడు .............................
8. అల్లాహ్ క్షమించాడు .............................
9. అల్లాహ్ క్షమించలేదు .............................
10. ధూర్తుడు .............................

# 18. హజ్రత్ నూహ్ (అలైహిస్సలాం)

ఆదం(అ) సంతానం పుష్పించి ఫలించింది. లెక్కకు మిక్కుటంగా ప్రపంచంలో వ్యాపించింది. ఎంతో కాలం వీరంతా సజ్జనులుగా జీవిస్తూ వచ్చారు. అల్లాహ్ వారి ఆయురారోగ్యాల్ని, సుఖసౌఖ్యాల్ని, సిరిసంపదల్ని పెంచుతూ వచ్చాడు. కాని షైతాన్ వారిని వదలలేదు. సన్మార్గం నుండి మానవుణ్ణి తప్పించేందుకు పన్నాగం పన్నుతూనే వచ్చాడు. కొంతమంది వాడి బుజ్జగింపు వలలో పడ్డారు. చెడు పనులు చేశారు. క్రమేణా చెడు వ్యాప్తిలోకి వచ్చింది. ప్రజలు మంచిని కాదని చెడు పనులు చేయసాగారు. ఏ మహనీయులు వారికి సన్మార్గం చూపించారో, హితవులిచ్చి రక్షించారో వారి మార్గాన్ని వదలి భ్రష్టులై అనేక రీతుల వ్యవహరించసాగారు. మహా పురుషుల విగ్రహాలు చేసి వారిని పూజింపసాగారు. అల్లాహ్‌ను వదిలి, దేవీదేవతల సాయం కోరుతూ వచ్చారు.

చెడు చాలా విస్తరించి ప్రజలు ఒకరినొకరు వేధించుకోసాగారు. బలహీనులపై బలవంతులు దౌర్జన్యం చేయసాగారు. విచ్ఛిన్నం వ్యాపించింది. హింసా దౌర్జన్యాలు పెచ్చుపెరిగిపోయాయి. అల్లాహ్‌కు జాలి వేసింది. మానవులపై కరుణ కలిగింది. మళ్ళీ రుజుమార్గం చూపించేందుకు ఒక ప్రవక్తను పంపించాడు. ఆయన పేరు హజ్రత్ నూహ్(అలైహి). నూహ్(అ) సమాజంలోని చెడులను విమర్శించి, విగ్రహారాధన మాన్పించారు. ఏ పనులంటే అల్లాహ్‌కు ఇష్టమో వాటిని తెలుపుతూ అల్లాహ్ ఇచ్చిన ఆజ్ఞల్ని పాటిస్తూ ఆదర్శవంతులయ్యారు. ఎంతోకాలం మంచి మాటల ప్రచారం చేశారు. చెడును రూపుమాపుతూ వచ్చారు. కాని ప్రజలు పాపపంకిలంలో చిక్కుకున్నారు. హజ్రత్ నూహ్(అ) చెప్పే మంచి మాటలు వారి చెవులు ఆలకిస్తాయా? మురికిలో పడిన పురుగుల్లా ఈ పాపాత్ములు ఆ చెడులోనే హాయిని చూడసాగారు. హజ్రత్ నూహ్(అ) దూరాన వస్తూ వుంటే ముఖం చాటేసి వెళ్ళేవారు. చెవులు మూసుకుని, ఆయన చెప్పేది వినకుండా ముఖాన్ని కప్పుకుని పలాయనం అయ్యేవారు. ఆయన హితవులు వినకూడదనేది వారి ధ్యేయం. కాని హజ్రత్ నూహ్ (అ) వారిని హెచ్చరించేవారు. అల్లాహ్ శిక్ష వచ్చిపడుతుందని భయపెట్టేవారు. కాని ఆ మూఢులు ప్రవక్తను హేళనచేస్తూ ఎక్కడుందయ్యా అల్లాహ్ ఇచ్చే కఠిన శిక్ష. నీకు చేతనైతే తీసుకురా అని వికటాట్టహాసం చేసేవారు. (అల్లాహ్ క్షమించుగాక!) వారికి తమ సంతానం, ఐశ్వర్యం పట్ల అహంభావం ఉండేది. అవన్నీ దేవతల కటాక్షమే అని తలచేవారు. తమ శక్తిసామర్థ్యాలపై విర్రవీగేవారు. మంచి వారిని, పేదలను, బలహీనులను చూసి వారిని నికృష్టులుగా భావించేవారు. కాలక్రమేణా నూహ్ (అ), కొద్దిపాటిగా ఉన్న ఆయన సహచరులపై విరుచుకుపడ్డారు. గర్భశత్రువుల్లాగా మారారు. చంపేస్తాం, జాగ్రత్త అని హెచ్చరించారు. చాలా కాలం వరకు అల్లాహ్ వారికి విడుపునిచ్చాడు. పరిస్థితులు హద్దు మీరాక హజ్రత్ నూహ్(అ), ఆయన సహచరులకు నిలువనీడ లేకుండా చేయాలని తలచారు దుండగులు. స్వయంగా చెడుకు బద్ధులై జీవించసాగారు. ఇక సంస్కరణ అసాధ్యమని తోచినప్పుడు నూహ్(అ) ఆ దుష్టులను శపించారు. కఠినశిక్ష ఇవ్వాలని కూడా దైవ నిర్ణయం అయ్యింది.

సజ్జనులకు సంరక్షణ, దుర్జనులకు శిక్ష ఇవ్వడం దైవ నియమం. నూహ్(అ)ను ఒక నావ తయారు

చెయ్యమని ఆజ్ఞాపించాడు అల్లాహ్. దైవాజ్ఞను శిరసావహిస్తూ ఒక పెద్ద నావ నిర్మించే పనిలో నిమగ్నమయ్యారు నూహ్(అ). కాఫిర్లు అది చూసి పరిహసించసాగారు. నీరు లేని ఎడారిలో నావ నిర్మాణం దేనికి అని ఎగతాళి చేశారు ఆ అవిశ్వాసులు. నూహ్(అ) ఓర్పుతో నావ నిర్మాణాన్ని పూర్తి చేశారు. దైవాజ్ఞనుసారం ఆ నావలో తన్ను అనుసరించినవారిని కూర్చొబెట్టారు, పశుపక్షుల్లో ఒక్కొక్క జంటను తమతో నావలోకి తీసుకొన్నారు.

చివరకు దైవ శిక్ష రానే వచ్చింది. నేల నుండి నీటి బుగ్గలు ఊరాయి. ఆకాశం నుండి కుండపోతగా వర్షం కురిసింది. చూస్తూచూస్తూ నేలంతా నీటిమయమయింది. వరదలు పొంగిపొరలడం మొదలయ్యాయి. ఇండ్లు కూలాయి. పిల్లాజెల్లా పాడి పశువులు నీటిలో మునిగాయి. కుంభవృష్టిలో సామానులు కొట్టుకొని పోయాయి. నూహ్(అ) నిర్మించిన నావ నీటిలో తేలుతుంది. కొంతమంది సురక్షిత ప్రాంతానికి తరలి పోతున్నారు. వారిలో నూహ్ (అ) తన తనయుని చూశారు. వాడు చెడు సహవాసం చేసి మార్గభ్రష్టుడైన వాడే. నావను చూసి పరిహాసం చేసినవాడే. తండ్రికి అవిధేయుడై విశ్వాస హీనుడైన వాడే. అల్లాహ్‌తో క్షమాపణ తెలిపి నావ ఎక్కిరా అని తండ్రి పలికారు. పెద్ద కొండ ఎక్కి ఉంటానన్నాడు ఆ దైవ తిరస్కారి. ఈ దినం ఈ నావ తప్ప శరణ్యం మరొకటి లేదని నూహ్(అ) అన్నారు. చూస్తూ చూస్తూనే ఒక పెద్ద అల వచ్చింది. నూహ్(అ) కుమారుణ్ణి నీట ముంచేసింది. వర్షం కురుస్తూ ఉంటే అంతా నీటిమయ మయింది. నేల నుండి నీటి ఊటలు పెద్దగా ఊరసాగాయి. నింగి నేలలు నీటిని ఈనుతున్నాయి. జలమయ మయిన ప్రపంచంలో కొండలు, గుట్టలు, చెట్లు, వనాలు, పర్వతాలు ఒకటేమిటి అంతా నీటిమయమయ్యాయి. అల్లాహ్ ఆజ్ఞ అయింది. నీరు కురవడం ఆగిపోయింది. నూహ్(అ) నావ నిర్మలంగా 'జూది' కొండపై ఆగింది. అల్లాహ్ అనుగ్రహం వల్ల నూహ్(అ) నావలోని వారు బ్రతికి బయటపడ్డారు. మిగిలిన మానవాళి దిక్కు దిశ లేక ఆస్తిపాస్తులతో నాశనమయ్యారు. ప్రవక్త పట్ల అవిశ్వాసం కలవారికి, ఆయనకు గర్భశత్రువులైన వారికి, ఆయన మాటల్ని హేళనగా తీసుకొని పరిహసించే వారికి పట్టే గతి ఇంతే.

## నేర్చుకొనదగు పాఠం

**మొదటిది :** తండ్రి ఎంత గౌరవోన్నత కల వ్యక్తి అయినప్పటికీ తనయుడు పాపాత్ముడైతే అల్లాహ్ శిక్ష నుండి తప్పించుకోలేడు, వినాశపరులలో చేరి నామరూపాలు లేకుండాపోతాడు. దైవప్రీతిపరుడు, సజ్జనశ్రేష్ఠుడు నూహ్(అ). కాని ఆయన కుమారుడు అల్లాహ్ శిక్షకు గురయ్యాడు. ఇక మామూలు మనుషుల గతి ఏంకాను. ప్రతి వ్యక్తికి తాను చేసిన మంచి చెడులకు ప్రతిఫలం ఉంటుంది. తండ్రి తనయుల సంబంధ బాంధవ్యం అక్కడ పనికి రాదు. ఇలాంటి తీర్పు న్యాయమనబడుతుంది.

**రెండవది :** సాంగత్యాన్నిబట్టి పరిణామం కలుగుతుంది. చెడ్డవారు మంచివారి సంతానాన్ని మంట కలుపుతారు. నూహ్(అ) కుమారుడు అవిశ్వాసుల వెంట ఉన్నాడు, దుష్టుడయ్యాడు.

అబ్బాయిలు, అమ్మాయిలు ఎప్పటికీ చెడ్డవారి సన్నిహితం కోరకండి. వారు మన ఇహపరాల్ని పరాజయపరుస్తారు. సజ్జన సాంగత్యం శ్రేయాన్నిస్తుంది.

**మూడవది :** చేసిన మంచి చెడులకు పూర్తి ఫలం పరలోకంలో అనుభవిస్తాం. కాని కొన్ని సమయాలలో అధర్మ ప్రవర్తన వల్ల ప్రపంచంలోనే పరాభవం అనుభవించవలసి వస్తుంది. అందులో ముఖ్యంగా దౌర్జన్యం, అహంకారం, ఆడంబరంతో ప్రవక్తల్ని కించపరిచి వారి పట్ల అపనమ్మకం కలిగిస్తే పరాభవం తప్పదు. దౌష్ట్యం వల్ల నూహ్ (అ) జాతి వారు తుఫానులో మునిగిపోయారు. అందుచేత, చెడు పనులు చేయకుండా జాగ్రత్తపడాలి. అంతేకాదు, ఇతరులు కూడా అధర్ములు కాకుండా ఉండేటట్లు చూడాలి.

**నాలుగవది :** ఎవరైతే దైవాజ్ఞలను, ప్రవక్తల ప్రబోధనలు ఆలకించి పాలిస్తారో, సజ్జనులుగా ఉంటారో వారు శిష్ట రక్షణకు, దుష్ట శిక్షకు కృషి చేస్తారు. ధర్మమార్గంలో కలిగే కష్టాల్ని అవలీలగా భరిస్తారు. ఓర్పు వహిస్తారు. దైవం అటువంటి వారితో సంతోషపడి, ప్రపంచంలో వచ్చే వినాశం నుండి రక్షిస్తాడు. పరంలో ఆనందంతో జీవించేట్లు స్వర్గ ప్రవేశమిస్తాడు.

## అభ్యాసం

**(అ) ఖాళీలను పూరించండి**

1. ప్రతి వ్యక్తికి తానుచేసిన మంచి చెడులకు ............ ఉంటుంది.
2. అధర్మ ప్రవర్తన వల్ల ప్రపంచంలోనే ................. అనుభవించవలసి వస్తుంది
3. చెడ్డవారు మంచి వారి .............. మంటగలుపుతారు.

**(ఆ) క్రింద రెండు రకాల వ్యక్తుల ప్రస్తావన వుంది. వారి గురించి కొన్ని విషయాలు వ్రాయబడ్డాయి. వాటి ముందు ఆయా వ్యక్తులకు సంబంధించిన నెంబర్లు వ్రాయండి**

**1. హజ్రత్ నూహ్ (అ)** **2) హజ్రత్ నూహ్(అ) జాతిలోని దుర్జనులు**

- పేదలను, బలహీనులను నికృష్టులుగా భావించేవారు.
- ఈ దినం ఈ నావ తప్ప శరణ్యం మరొకటి లేదు.
- పాప పంకిలంలో చిక్కుకున్నారు.
- అల్లాహ్ రుజుమార్గం చూపేందుకు, తన ఇష్టాన్ని తెలిపేందుకు పంపించాడు.
- మంచి విషయాలు వినేందుకు ఆసక్తి చూపేవారు కాదు
- ఆస్తిపాస్తులతో నాశనమయ్యారు.
- సంతానం, ఐశ్వర్యం పట్ల అహంభావం ప్రదర్శించేవారు.
- చెడుల నుంచి, విగ్రహారాధన నుంచి ఆపేవారు.
- శిక్ష వచ్చిపడుతుందని భయపెడితే అవహేళన చేసేవారు.
- అల్లాహ్ ఆదేశాలను శిరసావహించే మహా పురుషుల విగ్రహాలను చేసి వాటిని పూజింపసాగారు.

# 19. హజ్రత్ ఇబ్రాహీం(అలైహిస్సలాం)

చాలా కాలం క్రితం, ఎంతో దూరంలో 'ఉర్' అనే పట్టణం ఉండేది. ఆ పట్టణంలో ఒక వ్యక్తి. అతని పేరు 'ఆజర్'. విగ్రహాలు విక్రయించేవాడు. విగ్రహాల్ని తయారుచేసి మహానగరంలో అమ్మేవాడు. ఉర్ పట్టణంలో అనేక మందిరాలుండేవి. మందిరం విగ్రహ నిలయం. ఆజరు ఇంకా అనేకులు విగ్రహారాధన చేసేవారు. కష్టనష్టాలు కలిగినప్పుడు సహాయపడమని వాటినే అర్థించేవారు.

ఆజరుకు కొడుకు పుట్టాడు. ఇబ్రాహీం అనే పేరుపెట్టాడు. ఆ పసికందు అందరిలా కాకుండా శైశవ దశ నుండే విజ్ఞతతో ఉండేవాడు. మంచి పనులు చేసేవాడు. విగ్రహారాధకులను చూస్తుంటే ఆశ్చర్యం కలిగేది. మనసులోనే ఇలా ఆలోచించేవాడు. విగ్రహాలు రాతితో, కట్టెతో చేయబడ్డాయి. తిండి తినవు నీరు త్రాగవు. నోరు తెరిచి మాట్లాడలేవు. చెవులు విప్పి వినలేవు. ఈగలు ముసిరితే వాటిని తొలగించనూ లేవు. ఆరాధకులు సమర్పించిన నైవేద్యాన్ని ఎలుకలు తీసుకెళుతుంటే వాటిని ఆపనూ ఆపవు. ఇలాంటి విగ్రహాలను పూజించేది ఎందుకు? మొక్కుబడులు చేసుకొనేదెందుకు? అవి నిలుచున్న చోటు నుండి కదలలేవు, మెదలలేవు. ఇతరులకు ఏ హాని తెచ్చిపెడతాయని!

ఒక దినం తండ్రి తనయులకు సంవివాదం జరిగింది. తాను ఆలోచించే మాటలన్నీ తండ్రికి తెలిపాడు. విన్న వెంటనే తండ్రి మండిపోయాడు, బెదిరించాడు. శిక్షిస్తానన్నాడు. ఇబ్రాహీం ఆగలేదు. ఇంకా ఇతరులకు అవే మాటలు తెలియపరిచాడు. ఎవరు వింటారని? అర్థం చేసుకోవడానికి ప్రయత్నించకుండా ఇబ్రాహీంపైన కోపడ్డారు. 'ఓ ఇబ్రాహీం ఈ విధానం మేము మా తాతముత్తాతల నుండి పొందాం. వారు విగ్రహాలను కొలిచేవారు. యావత్తు జాతి వాటిని పూజిస్తుంది. మేమెలా వదలాలి?' అంటూ ఇబ్రాహీం చెప్పిన చక్కటి మాటల్ని, సత్యాన్ని త్రోసిపుచ్చారు.

ఎలాగైనా సరే, ప్రజలకు సత్యాన్ని తెలియపరిచి విజ్ఞులుగా చేయాలని నిర్ణయించాడు ఇబ్రాహీం. ఒక ఉపాయం కనుగొన్నాడు. ఉత్సవ దినం వచ్చింది. ఊరంత ఉత్సవంలో పాల్గొనడానికి వెళ్ళారు. స్త్రీ పురుషులు, బాల బాలికలు, వయోవృద్ధులు అందరూ ఆనందంతో ఉత్సవ క్రీడలో నిమగ్నులయ్యారు. ఇబ్రాహీం ఒంటరిగా ఊరిలోనే ఉండిపోయాడు. ఒక గొడ్డలి చేతపట్టాడు. విగ్రహాల వరకు వెళ్ళాడు. ఒక్కొక్కటిగా అన్నిటిని పడగొట్టాడు. ఒక పెద్ద విగ్రహం వదలేశాడు. తెచ్చిన గొడ్డల్ని పెద్ద విగ్రహపు మెడలో వేశాడు.

ఉత్సవానికి వెళ్ళిన ప్రజలు వాపసు వచ్చారు. విగ్రహాల పరిస్థితిని చూసి కోపోద్రిక్తులయ్యారు. ఈ పని చేసిందెవరా అని ఆలోచించారు. కొంత మంది ఇబ్రాహీం పేరు చెప్పారు. వెంటనే పిలిపించారు, గర్జించి అడిగారు.

'ఏదైనా తగవు వచ్చి పడిందేమో. గజ విగ్రహం నిగ్రహం కోల్పోయి ఆగ్రహించిందేమో. అదే ఈ పని చేసి ఉంటుంది. అడిగి చూడండి చెబుతుందేమో' అని అన్నారు ఇబ్రాహీం(అ).

ప్రజలందరూ ఇలా అన్నారు : 'విగ్రహాలు ఎక్కడైనా మాట్లాడతాయా? ఇది నీకు తెలుసు కదా'?

ప్రజలకు హితబోధ చేసే మంచి అవకాశం చేజిక్కింది. ఇబ్రాహీం(అ) ఇలా అన్నారు : 'ఈ విగ్రహాలు మాట్లాడనప్పుడు, కదలక మెదలక పెట్టినచోటే ఉన్నప్పుడు, లాభనష్టాలు కలిగించలేనప్పుడు, మీరు వాటిని ఎందుకు పూజిస్తారు?'

అది విని వారు సిగ్గుపడ్డారు. కాని సత్యామోదన వారి మస్తిష్కాన చేరలేదు. ఇబ్రాహీం చేసిన పనికి తీవ్రంగా శిక్షించాలని నిర్ణయించారు. నిండు ప్రాణాలతో దహనం చేయండని అన్నారు. మిన్నంటే మంటలు వేశారు. హజ్రత్ ఇబ్రాహీం(అ)ను అందులో పడేశారు. అల్లాహ్ ఇబ్రాహీం(అ)ను రక్షించాడు. వెంటనే అగ్నికి ఆజ్ఞ ఇచ్చాడు. మంట చల్లబడిపోయింది. బయటపడ్డారు.

ఇబ్రాహీం (అ) జాతి వారు సూర్యచంద్ర నక్షత్రాదులను కూడా పూజించేవారు. వాటిలో కూడా పూజార్హత ఇబ్రాహీం(అ)కు ఏమాత్రం కనబడలేదు. స్వయంగా అవి శక్తిలేనివే. ఇతరుల సహాయంతోనే అవి పనిచేస్తున్నాయి. ఒకప్పుడు కనబడుతూ, మరొకప్పుడు మరుగవుతున్నాయి. నిర్ణీత మార్గంలో తు.చ తప్పకుండా పరిభ్రమిస్తున్నాయి. స్థితిగతుల్లో పరాధారం, అవి ఆరాధ్య దైవాలు కాగలవా? చివరకు ఆయన ఇలా అన్నారు: 'నా దైవం వీటిని ఇంకా ఈ విశ్వాన్ని సృష్టించాడు. అందరికి కావలసిన అన్నపానీయాలు అందజేశాడు. జీవన్మరణాలు ఆయన చేతుల్లోనే ఉన్నాయి. ఆయన తప్ప ఆరాధ్య దైవం ఎవరూ కారు' అని నిర్ణయం తీసుకొన్నారు ఇబ్రాహీం(అ).

అల్లాహ్ ఇబ్రాహీం (అ)ను తన ప్రవక్తగా చేశాడు. మానవులందరికీ చక్కటి మార్గం చూపమని ఆదేశించాడు. దైవసందేశం మానవులకు అందించారు ఇబ్రాహీం(అ). మనుషుల్ని మంచిపనులు చెయ్యమని కోరారు. చెడును నివారించే పని ప్రారంభించారు. ప్రజలు ఆయన చెబుతున్న సత్యప్రబోధనల్ని అంగీకరించక ఆయనకు శత్రువులయ్యారు. తండ్రి ఆజరు కూడా బద్ధ శత్రువయ్యాడు. చంపేస్తాను, నరికేస్తాను అని హెచ్చరించాడు. చెడిన సమాజాన్ని సంస్కరించడం సులభ సాధ్యమా? ఇంటిని స్వంత పట్టణాన్ని, స్వదేశాన్ని కూడా వదిలి చాలాదూరం వెళ్ళిపోయారు ఇబ్రాహీం(అ). ముసలి వయసులో ఆయనకు ఇరువురు పుత్రులు కలిగారు. ఒక పుత్రుని పేరు ఇస్మాయీల్. ఇస్మాయీల్, అతని తల్లికి మక్కాలో నివాసం ఏర్పాటు చేశారు. అల్లాహ్ ఆజ్ఞ వల్ల జమ్‌జమ్ సెలయేరు అక్కడ పుట్టింది. ప్రజలు అక్కడ నివాసం ఏర్పరచుకొన్నారు. కాలక్రమేణ అది మక్కా మహానగరంగా పరిణమించింది.

ఇస్మాయీల్ (అ) యువకుడయ్యాడు. అప్పుడు ఇబ్రాహీం(అ) ఒక విచిత్రమైన కలగన్నారు. యవ్వనంలో ఉన్న తనయుణ్ని తన హస్తంతో దైవమార్గంలో బలిదానం (జుబహ్) చేస్తున్నారు. అది కలకాదు, దైవాజ్ఞ అని ఇబ్రాహీం(అ) నిర్ధారించారు. చూసిన స్వప్నం తనయునికి వివరించారు. ఆ తనయుడు తన ప్రాణాలర్పించడానికి సంసిద్ధుడయ్యాడు. 'ఓ తండ్రి, అల్లాహ్ ఇచ్చిన ఆజ్ఞను తప్పక నిర్వహించండి' తండ్రి, తనయుని ప్రాణం దైవానికి అర్పిస్తుండగా అల్లాహ్ వారిని రక్షించాడు, తండ్రీ, కుమారుడు చేసిన త్యాగం అల్లాహ్‌కు నచ్చింది. ప్రభువు హజ్రత్ ఇబ్రాహీం(అ)ను విశ్వనాయకునిగా చేశాడు. హజ్రత్ ఇస్మాయీల్ (అ)కూడా ప్రవక్తగా నియమించబడ్డారు. కుమారుని ప్రాణార్పణకు మారు

ఒక జంతువు ప్రాణదానం చెయ్యమని ప్రభువు ఆదేశించాడు. ఈ సంఘటనను స్మరించుకొంటూ ప్రతి సంవత్సరం మనం ఖుర్బానీ చేస్తున్నాం. దైవాజ్ఞను శిరసావహిస్తాం. అవసరం వస్తే ప్రాణాన్ని కూడా అర్పిస్తాం అనే ప్రతిజ్ఞ ఈ ఖుర్బానీలో ఉంది.

దైవం ఆ ఇరువురి ప్రవక్తలకు ఆరాధనాలయం నిర్మించమని ఆజ్ఞ ఇచ్చాడు. తండ్రి కొడుకులు 'కాబా' దైవ గృహాన్ని కట్టారు. కాబా మక్కా పట్టణంలో ఉంది. ప్రపంచంలోని మొత్తం ముస్లింలు కాబా వైపు ముఖం చేసి నమాజులు చేస్తారు. హజ్ ధర్మ నిర్వహణకు ముస్లింలు ఇక్కడికే వెళ్తారు.

ఈ చరిత్ర మనకెన్నో విషయాలు బోధిస్తోంది

**మొదటిది :** దైవమార్గంలో మనమందరం ఇల్లు, దుకాణం, ధనప్రాణం, ఆలుబిడ్డల్ని త్యాగం చెయ్యడానికి సంసిద్ధంగా ఉండాలి. హ(జ్రత్ ఇబ్రాహీం (అ)ను ఏ ఖుర్బానీ కోరబడిందో ఆ ఖుర్బానీ ఇవ్వడానికి మనం సంతోషంగా ముందుకు రావాలి.

**రెండవది :** దైవం మానవుల పరీక్ష తీసుకొంటాడు. ఈ పరీక్షలో కృతార్థుడయ్యేవారికి ఉన్నత స్థానం ప్రసాదిస్తాడు.

**మూడవది :** అల్లాహ్ పట్ల ఎవరైతే పూర్తి నమ్మకం కలిగి వుంటారో వారికి అడగడుగునా దైవ మద్దతు లభిస్తుంది. నిరాశ నిస్పృహలకు, వినాశనానికి పాలుకాకుండా వారు చూడబడతారు. హ(జ్రత్ ఇబ్రాహీం(అ) అన్ని సందర్భాలలో దైవంపై నమ్మకంతో ఉన్నారు. ఆ దైవమే ఆయనకు మద్దతునిచ్చాడు.

**నాలుగవది :** అల్లాహ్ ఆజ్ఞ లేకుంటే ప్రాణ శత్రువు కూడా చీమ కుట్టినంత చెడు చెయ్యలేదు. నమ్రూద్, ఆయన సహచరులు హ(జ్రత్ ఇబ్రాహీం(అ)కు పెట్టదలచిన బాధలు, కలిగింప చూసిన నష్టాలు ఇన్నన్ని కావు. కాని ఆయన్ను ఎవరు ఏమి చేయలేకపోయారు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి**

1. విగ్రహాల గురించి హ(జ్రత్ ఇబ్రాహీం(అలైహి) ఏమని ఆలోచించేవారు?
2. విగ్రహాలను విరగ్గొట్టి ఇబ్రాహీం (అ) తన జాతి జనులకు ఏ విషయాన్ని విశదీకరించారు?
3. అగ్ని ఇబ్రాహీమ్(అ)ని ఎందుకు కాల్చలేదు?
4. ఇబ్రాహీమ్ (అ) 'ఉర్'పట్టణాన్ని ఎందుకు విడిచిపెట్టాల్సి వచ్చింది?
5. హ(జ్రత్ ఇస్మాయీల్ (అ), ఆయన తల్లిని హ(జ్రత్ ఇబ్రాహీమ్(అ) ఎక్కడ వదిలిపెట్టి వచ్చారు?
6. ఇబ్రాహీమ్ (అ) తన కలను ఎలా సాకారం చేసుకున్నారు?
7. ప్రతియేడు మనం ఖుర్బానీ ఇచ్చి ఏ సంఘటనను స్మరించుకుంటున్నాం?

**(ఆ) ఖాళీలను పూరించండి**

1. ఇబ్రాహీమ్(అ) తండ్రి పేరు ...........
2. ఇబ్రాహీమ్(అ) జాతివారు సూర్యచంద్ర నక్షత్రాదులను ...........
3. అల్లాహ్ ఇబ్రాహీమ్(అ)ను విశ్వ.....................గా చేశాడు.
4. ప్రపంచంలోని ముస్లింలందరూ ........ వైపు ముఖం చేసి నమాజ్ చేస్తారు.
5. హజ్ ధర్మ నిర్వహణకు ముస్లిములు ...........కు వెళ్తారు.
6. ఇబ్రాహీమ్(అ) అల్లాహ్ పెట్టిన పరీక్షలో ..........
7. అల్లాహ్‌ఆజ్ఞ లేకుండా పంచ ప్రాణాలు భక్షించే విరోధి కూడా ................. చెడు కూడా చెయ్యలేదు

## చేయాల్సిన మరి కొన్ని పనులు

హజ్ చేసి వచ్చిన వారి దగ్గరికి వెళ్లి హజ్ గురించిన విషయాలు అడిగి తెలుసుకోండి.



# 20. దివ్య ఖుర్‌ఆన్

విశ్వ వలయాన్ని అందులో ఉన్న సమస్తాన్ని సృష్టించింది అల్లాహ్. భూమిని సృష్టించాడు, ఆకాశాన్ని కప్పుగ ఏర్పాటు చేశాడు. సూర్యచంద్రుల వెలుగునిచ్చాడు. గాలులు వీస్తున్నాయి. వర్షాలు కురుస్తున్నాయి. పంటలు పండుతున్నాయి. పుష్ప ఫలాలు పుష్కలంగా లభ్యమవుతున్నాయి. తినడానికి తిండి, త్రాగడానికి నీరు, కట్టడానికి కప్పుకోవడానికి గుడ్డ మనకిచ్చాడు అల్లాహ్. హాయిగా బ్రతుకడానికి కావలసినన్ని ఇచ్చాడు. ఆయనే మనల్ని పోషించేవాడు, యజమాని కూడా. ఆయనే అందరి శాసకుడు, ప్రభువు కూడా. ఆయన రాజ్యం అనంతం. ఈ భూమండలం ఆయన రాజ్యంలో ఏ కొద్ది భాగం మాత్రమే. ఈ భూమిపైనే మనకు నివాసం ఏర్పరిచాడు, ఇక్కడి వస్తువులన్నీ మనకు అధీనం చేశాడు మన ప్రభువు. భువిపై మనల్ని ఆయన ప్రతినిధులుగా చేశాడు. ఈ భూమిపై మనం ఎలా బ్రతకాలి, ఆయనిచ్చిన వస్తువుల్ని మనం ఎలా వాడాలి, వాటి విధానం కూడా మాకు తెలియజేశాడు ప్రభువు. ఈ విషయ ప్రబోధన కోసం అల్లాహ్ ప్రవక్తల్ని పంపించాడు. ప్రవక్తలు ప్రభువు గ్రంథాల్ని కూడా తెచ్చి ఇచ్చారు. ఈ గ్రంథాలలో దైవాజ్ఞలున్నాయి. జీవితం గడిపే మార్గం ఉంది. ప్రవక్తల పరంపరలో మహాప్రవక్త ముహమ్మద్ (స)చివరి వారు. వీరిపై దివ్య గ్రంథం ఖుర్‌ఆన్‌ను అవతరింపజేశాడు. మానవాళి కోసం పంపబడిన చివరి గ్రంథమిదే. ఈ గ్రంథం పొల్లుపోకుండా భద్రంగా ఉంది. అసలు రూపంలో ఉంది. దీనికంటే ముందు పంపబడిన గ్రంథాలలో ప్రజలు మార్పులు చేర్పులు చేశారు. కొన్నిటిని చిత్తు కాగితాల్లా వ్యర్థం చేసుకున్నారు. కాని అల్లాహ్ స్వయంగా తన గ్రంథం ఖుర్‌ఆన్‌ను భద్రపరిచే బాధ్యత తీసుకున్నాడు. అల్లాహ్ కోరికల్ని, అభిలాషల్ని తెలుసుకొనేందుకు ఈ గ్రంథ మొక్కటే ఆధారం. ప్రజలకు హితవులు ఇందులో ఉన్నాయి. ప్రవక్తల జీవిత గాధలు ఇందులోనే ఉన్నాయి. దైవాజ్ఞలకు కట్టుబడి జీవించే వారికి ఇందులో శుభవార్తలున్నాయి. దైవ నిరాకరణ చేసేవారికి భయపెట్టడం కూడా జరిగింది. ఈ ఆత్మీయ గ్రంథం అరబ్బీ భాషలోనే ఉంది. ఇందులో మనకు కావలసిన మంచి మంచి ప్రబోధనలున్నాయి. కొన్ని దైవోపదేశాల అనువాదం ఇస్తున్నాం. ఎంత మనోజ్ఞంగా ఉన్నాయో చూడండి.

- అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యుడులేడు. కేవలం అతన్నే ఆరాధించండి. అతని దాస్యం మాత్రమే చేయండి.
- అల్లాహ్,ఆయన ప్రవక్త ప్రవచనాలని పాటించండి. తల్లిదండ్రులకు మేలు చేయండి.
- మీ ధన ప్రాణాలతో దైవమార్గంలో జిహాద్ చేయండి.
- ముస్లింలందరూ పరస్పరం సోదరులు. వారి మధ్య స్పర్థలుంటే సంధి కుదర్చండి.
- మీలో ఎవరైతే అందరికంటే ఎక్కువ దైవానికి భయపడతాడో అతడే అల్లాహ్ దృష్టిలో అందరికంటే గౌరవనీయుడు.
- అబద్ధం పలుకడం మానండి.
- ఇచ్చిన మాట నిలబెట్టుకోండి.

- ఇచ్చిన మాట విషయంలో విచారణ ఉంటుంది.
- పరుషంగా పలుకకండి, ఎవరినీ వెగటు మాటలతో ఎక్కిరించకండి.
- ఎవరి దోషాన్వేషణలో పడకండి, ఇతరుల్ని పరోక్ష నిందలపాలు చేయకండి.
- సత్కార్యాలలో పాలుపంచుకోండి. చెడు కార్యాలలో సహాయపడకండి.
- తల్లిదండ్రులతో మంచిగా మెలగండి.
- శ్రేష్టమైన సమాజం మీది, మీరు మానవాళికి రుజుమార్గం చూపడానికి ఎన్నుకోబడ్డారు.
- నిత్యం పరిశుభ్రంగా ఉండేవారంటే దైవానికి ఇష్టం.
- ప్రవక్త (స) జీవితంలో మీకు గొప్ప ఆదర్శం ఉంది.

దైవాన్ని ఏవిధంగా వేడుకోవాలో ఆ మాటలు కూడా దివ్యఖుర్ఆన్ మనకు బోధిస్తుంది. అల్లాహ్ ప్రసాదిస్తేనే మేమనుభవిస్తాం. ఆయన ఇలా ప్రార్థించాలని మాకు నేర్పించాడు కూడా.

رَبِّ زِدْنِي عِلْمًا

**రబ్బీ జిద్‌ని ఇల్‌మా**

ఓ నా ప్రభూ, నా విజ్ఞానాన్ని పెంచు

رَبَّنَا آتِنَا فِي الدُّنْيَا حَسَنَةً وَفِي الْآخِرَةِ
حَسَنَةً وَقِنَا عَذَابَ النَّارِ

**రబ్బనా అతినా ఫిద్దునియా హసనతవ్**
**వ్వఫిల్ ఆఖిరతి హసనతవ్వ్వఖినా అజాబన్నార్**

ఓ మా ప్రభూ! ఈ ప్రపంచంలో మాకు మేలు చేకూర్చు. పరలోకంలో కూడా మేలుప్రసాదించు. నిప్పులు కక్కే నరక యాతన నుండి రక్షించు.

رَبِّ ارْحَمْهُمَا كَمَا رَبَّيَانِي صَغِيرًا

**రబ్బిర్ హమ్‌హుమా కమా రబ్బయానీ సగీరా**

ఓ నా ప్రభూ! నా తల్లిదండ్రులపై కరుణచూపు. శైశవ దశలో ఏ విధంగా నన్ను వారు పెంచారో ఆ విధంగా వారిని చూడు.

ప్రార్థనలు చేసే విధానాలు స్వయంగా అల్లాహ్ ప్రబోధించాడు. ఆ ప్రార్థనలనాలకించి దయతో ఆదరించేది ఆయనే. అలాంటి ఆదరణకు, కృపకు పరిమితం అంటూ ఉంటుందా. ఎల్లప్పుడు అల్లాహ్‌ను వేడుకోవాలి. ఓ ప్రభూ మాపై కరుణించి నీ అనుగ్రహాలను ప్రసాదించు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. భూ మండలంపై మానవుని స్థానం ఏమిటి?
2. అల్లాహ్ మానవుల మార్గదర్శకం కోసం చేసిన ఏర్పాటు ఏమిటి?
3. ఇప్పటివరకు దాని అసలు రూపంలో ఉన్న దైవగ్రంథం ఏది?
4. ఖుర్‌ఆన్ ఏ భాషలో ఉంది? అది ఎవరిపై అవతరించింది?
5. ఖుర్‌ఆన్‌లో ఏ విషయాలు బోధించబడ్డాయి?
6. అల్లాహ్ వద్ద మానవులలో అందరికన్నా గొప్పవాడు, గౌరవనీయుడు ఎవరు?
7. జ్ఞానాభివృద్ధి కోసం ఖుర్‌ఆన్ నేర్పిన దుఆ ఏమిటి?
8. ఖుర్‌ఆన్‌లో తల్లిదండ్రుల కోసం ఏ దుఆ చేయమని ఆదేశించడం జరిగింది?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. అల్లాహ్ భూమిపై మమ్మల్ని ఆయన .............గా చేశాడు.
2. మానవాళి కోసం పంపబడిన చివరి గ్రంథమిదే. ఇది దాని ................ రూపంలో ఉంది.
3. ఖుర్‌ఆన్‌లో దైవాజ్ఞలకు కట్టుబడి జీవించేవారికి ఇందులో ............ దైవ నిరాకరణ చేసేవారికి భయపెట్టడం జరిగింది.
4. తల్లిదండ్రులకు ........... చేయండి.
5. ప్రవక్త (స) జీవితంలో మీకు గొప్ప .................. ఉంది.
6. తల్లిదండ్రులతో ............ గా మెలగండి.
7. ................. పరస్పరం సోదరులు
8. ఇచ్చిన మాట నిలబెట్టుకోండి. ఇచ్చిన మాట విషయంలో .............. ఉంటుంది.
9. సత్కార్యంలో పాలుపంచుకోండి. ..................... కార్యాలలో సహాయపడకండి.
10. నిత్యం పరిశుభ్రంగా ఉండేవారంటే ............... ఇష్టం.
11. మీది ...................... సమాజం. మీరు మానవాళికి రుజుమార్గం చూపడానికి ఎన్నుకోబడ్డారు.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ఖుర్‌ఆన్‌లో పేర్కొన్న దుఆలను ఖంఠస్థం చేయండి. ప్రతి నమాజు తరువాత అల్లాహ్ సన్నిధిలో ఈ దుఆలు చేయండి

# 21. హదీసులు

అల్లాహ్ చివరి ప్రవక్త మన ప్రియాతి ప్రియమైన మహాప్రవక్త(స). మానవాళికి హితబోధ చేయడానికి ఆయన్ను పంపించాడు మన ప్రభువు. ఆయన దైవ సందేశాన్ని మన వరకు చేర్పించారు. అందరికీ చక్కని బాట చూపించారు. దైవాభిలాష ఏమిటో మనకు తెలియపరిచారు. అల్లాహ్ ఆజ్ఞలననుసరించి జీవితం గడిపి మనకు ఆదర్శమయ్యారు. ఆయన అడుగుజాడల్లో నడుచుకుంటే మన జీవితం విజయవంతమవుతుంది.

**మహాప్రవక్త**

ఏదైతే ప్రబోధించారో

ఏదైతే చేశారో

ఏ పనులైతే మంచి పని ప్రస్తావించారో

ఏ పనులైతే చెయ్యమని ఆదేశించారో

ఏ పనులైతే చెయ్యకూడదని శాసించారో

ఏ మాటలైతే సంస్కృతిపరంగా చెప్పారో

వాటన్నింటిని ఆయన సహచరులు జ్ఞాపకం చేసుకొన్నారు. జాగ్రత్తగా భద్రపరచుకొన్నారు. ప్రేమతో ఇతరుల వరకు చేర్చారు మన పెద్దలు, పండితులు వాటిని నోటు చేసుకున్నారు. గ్రంథస్థం కూడా చేశారు. ఈ మాటలు చేతలు మాకు ముఖ్యం శ్రేయోదాయకం కూడా. వీటినే 'హదీసులు' అంటాం.

దివ్యఖుర్ఆన్ తర్వాత సత్యధర్మంలో వీటికి ప్రాముఖ్యత ఉంది. ఎందుచేతనంటే ఇవన్నీ మహాప్రవక్త అల్లాహ్ ఆజ్ఞలననుసరించే చెప్పారు. వాటిని పాటించి చూపించారు.

మనం ముస్లిములము. ఖుర్ఆన్, హదీసు పట్ల మాకు విశ్వాసం. వాటిలో ఉన్న హితవుల్ని వినయంతో పాటిస్తాం. అందులోనే ఉంది మా శ్రేయం. కొన్ని హదీసులను మీకు పరిచయం చేస్తున్నాం. అవి ఎంత ప్రేమ ఉట్టి పడేట్లున్నాయో చూడండి. అవి మీకెంత ప్రయోజనపడుతాయో ఆలోచించండి.

**కొన్ని హదీసులు**

పసిపిల్లలు స్వర్గపు పుష్పాలు

తండ్రి సంతానానికిచ్చే ఉత్తమ కానుక వారికిచ్చే విద్యాబుద్ధులే

స్వర్గం తల్లిపాదాల క్రింద ఉంది

అన్ని దానాలకంటే ఆకలిదప్పులు కలవారికి కడుపునిండా తిండి పెట్టడం ఉత్తమం.

గర్వపడేవానికి డంబాలు పలుకేవానికి స్వర్గ ప్రవేశం లేదు.

తిట్లుపలికేవాడు, ఆ తిట్లను వ్యాపింపజేసేవాడు ఇద్దరూ ఆ పాపంలో సమానులే.

పరోక్షం నిందారోపణ చేసేవాడు స్వర్గ ప్రవేశం చేయలేడు.

మీలో ఎవరైతే ఉత్తమ నీతిపరులో వారే శ్రేష్ఠులు

లజ్జ మొత్తం ధర్మమే

**మహాప్రవక్త(స) చెప్పిన నిషేధాలు**

కుడిచేతితో మలమూత్రాలను శుభ్రం చేయరాదు.

త్రాగే పళ్ళెంలో నోటితో ఊదరాదు.

నిలబడి తినకూడదు, పానీయాలు సేవించరాదు.

అబద్ధాలు పలుకరాదు

నేల బొరియలలో మూత్రవిసర్జన చేయరాదు

మూగ జంతువుల్ని కష్టపెట్టకూడదు.

దిండుకు ఆనుకొని అన్నం తినరాదు.

దారిలో మల మూత్ర విసర్జన చేయరాదు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. తండ్రి తన సంతానానికి ఇచ్చే ఉత్తమ కానుక ఏది?
2. అన్ని దానాలకంటే ఉత్తమమైన దానం ఏది?
3. అశ్లీలాన్ని పలికేవాడు, దాన్ని వ్యాపింపజేసేవాడు ఏ విషయంలో సమానులు?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. ప్రవక్త(స) హితవుల్ని పాటించడంలోనే మన ............ ఉంది.
2. ఖుర్ఆన్ తరువాత హదీసులకే .......... ఉంది.
3. స్వర్గం తల్లి ............. క్రింద ఉంది.
4. మీలో ఎవరైతే ఉత్తమ ...................... వారే శ్రేష్ఠులు.
5. పసిపిల్లలు ................ పుష్పాలు

**ఇ) ప్రియ ప్రవక్త(స) కొన్ని విషయాలను చేయమని ఆదేశించారు. మరికొన్నింటి నుంచి వారించారు. క్రింద కొన్ని విషయాలు ఇవ్వడం జరిగింది. వాటిలో ప్రవక్త(స) చేయమంటూ ఆదేశించిన విషయాల ముందు 'ఆ' అని, వారించిన విషయాల ముందు 'వా' అని వ్రాయండి.**

1. సంతానానికి విద్యాబుద్ధులు నేర్పడం ( )
2. గర్వపడడం, డాంబికాలు పలకడం ( )
3. తిట్టడం, వాటిని వ్యాపింపజేయడం ( )
4. పరోక్ష నింద మోపడం ( )
5. ఖుర్‌ఆన్ చదవడం, చదివించడం ( )
6. రంధ్రాల్లో మూత్ర విసర్జన చేయడం ( )
7. ఆకలిగొన్న వారికి అన్నం పెట్టడం ( )
8. కుడిచేతితో మూత్ర విసర్జన, శుభ్రం చేయడం ( )
9. జంతువులను కష్టపెట్టడం ( )
10. అబద్ధాలు పలకడం ( )
11. ఆనుకుని అన్నం తినడం ( )



# 22. పాటించాల్సిన ప్రవర్తనావళి

మనం ముస్లిములము. మహాప్రవక్త ముహమ్మద్(స) ప్రవర్తనావళిని మనమందరం అనుసరిస్తున్నాం. ఎవరు ఆ ప్రవర్తనావళిని తిరస్కరించి నడుచుకోరు. ఎవరైనా ఉల్లంఘిస్తూ వచ్చారంటే అలాంటి వారిని మెచ్చుకోము కూడా. అందుచేతనే మనం మంచి ప్రవర్తనావళిని పాటించేవారిలో ఉన్నాం. అల్లాహ్, మహాప్రవక్త మనతో సంతోషపడతారు, ప్రజలు కూడా మమ్మల్ని దగ్గర చేర్చి ప్రేమతో చూస్తారు. ప్రవర్తనావళిలో మాటలు ఉటంకిస్తున్నాం, గమనించండి.

1. ప్రతి పనిని 'బిస్మిల్లాహ్' అంటూ ప్రారంభిస్తున్నాం. తినే సమయంలో పానీయాలు తీసుకొనే సమయంలో చదవడం, వ్రాయడం ప్రారంభించే సమయంలో ఇంకా ఏదైనా పని మొదలుపెడితే 'బిస్మిల్లాహ్' అంటూ ప్రారంభిస్తాం. దీనివల్ల శుభం కలుగుతుంది.
2. సలాం చేయడం ఎప్పుడూ మరవం. మాట ముచ్చటకు ముందు సలాం చేస్తాం. ఉదయం నిద్ర నుంచి లేవగానే ఇంటి వారందరికి సలాం చేస్తాం. మసీదులో ప్రవేశిస్తే సలాం చేసి లోనికి వెళతాం, మసీదు నుంచి బయటికివస్తే సలాం చేసి వస్తాం, పాఠశాల వెళితే ఉపాధ్యాయులకు,స్నేహితులకు సలాం చేస్తాం. క్లాసులో, ఆఫీసులో సలాం చేసి లోనికి ప్రవేశిస్తాం, సలాం చేస్తూ వాపసు వస్తాం. చిన్న పెద్ద ఎవరైనా సరే, సలాం చేయడంలో మేమే ముందుంటాం. ఇందులో ఎక్కువ పుణ్యం ఉంది. సలాం చేయడం వల్ల మన మధ్య ప్రేమ పెరుగుతుంది. సలాం విన్న వారు మా కోసం ప్రార్థన కూడా చేస్తారు.
3. దేహ పరిశుభ్రత అంతరాత్మ పరిశుభ్రతకు చిహ్నం. అందుచేతనే పరిశుభ్రతకు మేము ఎక్కువ ప్రాధాన్యతనిస్తాం. మలమూత్ర విసర్జన నిర్జన ప్రదేశంలో దూరంగా చేస్తాం, మట్టి పెళ్ళలతో శుభ్రం చేస్తాం, నీటితో బాగుగా కడుక్కుంటాం. ఆ తరువాత మట్టితో లేక సబ్బుతో చేతులు తోముకొని శుభ్రం చేసుకుంటాం.
4. ఇంటి పరిసరాలలో సందులు గొందుల్లో మేము కాలకృత్యాలు తీర్చుకోము. ఎక్కడైనా మారుమూల ప్రదేశానికి పోయి కాలకృత్యాలు తీర్చుకొంటాం. కొందరు పిల్లవాళ్ళు ఇంటి ప్రాంగణాలలో, వీధుల్లో మలమూత్రాలు విసర్జిస్తారు. దారిన పొయ్యే వారికి దీనివల్ల ఎంత కష్టం కలుగుతుందో ఆలోచించండి. వారి పాదరక్షలు, దుస్తులు మలినమవుతాయి. దానికి బాధ్యులైనవారికి, ఆ వ్యక్తి కసరుకొంటూ నాలుగు చివాట్లు పెడతాడు. తన బాధను వెళ్ళగక్కుతాడు. చెడుగా ప్రవర్తించడమెందుకు, పరులకు దు:ఖం కలిగించడమెందుకు, అల్లాహ్, ఆయన దూతలు, బాధితుల శాపానికి గురికావడమెందుకు?
5. అన్నం మనం కుడిచేతితో తింటాం. మలమూత్రాలను ఎడమ చేతితో కడుక్కుంటాం. ముక్కు చీదడంలో కూడా జాగ్రత్తపడతాం. దూరంగావెళ్ళి ఎడమచేతితో చీదుతాం. చీదిన ముక్కును

చేతితో తుడుచుకోకుండా రుమాలుతో శుభ్రపరచుకొంటాం. అవసరమున్నవారికి నీరు, ఇంకా ఇతర వస్తువులు ఇస్తే కుడిచేతితో ఇస్తాం. ఎవరైనా మనకు ఏదైనా ఇస్తే వాటిని కూడా కుడిచేతితో తీసుకొంటాం.

6. కొంతమంది మంచి అలవాట్లు అలవరచుకోనివారు, ఎక్కడ పడితే అక్కడే ముక్కు చీదుతూ ముక్కుల్లో వేళ్ళు వేసుకుంటూ పళ్ళతో గోర్లు కొరుక్కుంటూ ఉంటారు. ఇది పరిశుభ్ర నియమావళికి విరుద్ధం, హానికరం కూడా.

7. పెద్దవారు మనల్ని పిలిస్తే 'జీ' అంటూ జవాబిస్తాం. దగ్గరకెళ్ళి వినయంతో నిలుస్తాం. ఏం చెబితే అది జాగ్రత్తగా వింటాం. ఇచ్చిన ఆజ్ఞను వెంటనే శిరసావహిస్తాం. రహస్య విషయమేదైనా చెబితే ఇతరులెవ్వరికి చెప్పకుండా జాగ్రత్తపడతాం. ఎవరైనా ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటుంటే అక్కడ్నుంచి వెళ్ళిపోతాం. అక్కడే ఉండి వారి సంభాషణ వినడానికి ప్రయత్నించం. ఎవరైనా ఏదైనా చెబుతూ ఉంటే వారి మాటకు అడ్డు చెప్పటానికి ప్రయత్నం చేయము. పూర్తిగా వినకుండా బదులు పలుకం. పెద్దల పేరు తీసుకొంటే జనాబ్ ఫలానా అంటూ పేరు తీసుకొని చివర సాహెబ్ అని ముగిస్తాం.

8. మహాప్రవక్త ముహమ్మద్(స) పేరు వినగానే మొదట 'దరూద్, సలాం' చెబుతాం. ఇతర ప్రవక్తల పేర్లు కూడా మేము సవినయంగా తీసుకొంటాం. పేరుకు ముందు హజ్రత్ చివర అలైహిస్సలాం చెబుతాం. మహాప్రవక్త సహచరుల పేర్లు, ఇంకా ఇతరుల పేర్లు చాలా గౌరవంతో తీసుకొంటాం. మహాప్రవక్త సహచరుల పేర్లు తీసుకొన్నాక రజిఅల్లాహు అన్హు అనీ, ఇతర మహనీయుల పేర్ల తరువాత 'రహ్మతుల్లాహ్ అలైహి' అని అంటాం.

9. ఇతరుల ఇంటిలో ప్రవేశించాలంటే ఇట్టే వెళ్ళం. కిటికీలో నుంచి వాకిలిలో నుంచి తొంగిచూడం కూడా. ఇంటి వాకిట ఒక పక్క నిలిచి, ఇంటిలో ఉన్న వారికి సలాం చేస్తాం. ఆ తరువాత లోనికి రావడానికి అనుమతి కోరుతాం. అనుమతి ఇచ్చాక ఇంటిలోకి వస్తాం. మేము మన ఇంటిలో వెళ్ళినప్పుడు కూడా సలాం చేసి వెళతాం, మేము వచ్చామని అందరికీ తెలుస్తుంది, ఎవరు పనిలో ఉంటారో మనకేం తెలుసు.

10. మేమంత అన్నాతమ్ముళ్ళు, అక్కాచెల్లెళ్ళు కలిసి భోజనం చేస్తాం. కాళ్ళు, ముఖం కడుక్కొని చేతులు శుభ్రం చేసుకొని భోజనానికి కూర్చుంటాం. 'బిస్మిల్లాహ్' అంటూ ప్రారంభిస్తాం. ఒకే పళ్ళెంలో తింటుంటే ఎవరి ఎదుట ఉన్న అన్నం వారు తింటాం. ఎప్పుడూ కుడిచేతితో అన్నం తింటాం. అన్నం పట్ల అసహ్యంగాని, చెడుచూపుతో చూడడం గాని ఉండదు. అన్నం తింటూ నీరు తాగదలిస్తే ఎడమ చేతితో గ్లాసుపట్టుకొని కుడిచేతితో సపోర్టు తీసుకొని కొద్ది కొద్దిగా కనీసం మూడు గుక్కలుగా త్రాగుతాం. భోజనానంతరం నోటిని నీటితో పుక్కిలించి చేయి కడుక్కొని అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకొంటాం.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. సలామ్ చేయడంలో ఎందుకు ముందుండాలి?
2. ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటుంటే మనం ఏం చేయాలి?
3. ప్రవక్తల పేర్లకు ముందు, ఆ తరువాత ఏమని పలకాలి?
4. ఇతరు ఇళ్ళలోనికి ప్రవేశించే ముందు మనమేం చేయాలి?
5. మనం మన ఇంట్లో ప్రవేశించడానికి ముందు ఎందుకు సలాం చేస్తాం?
6. భోజనం మధ్యలో ఎలా నీళ్ళు త్రాగాలి?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. ప్రతి పనిని బిస్మిల్లాహ్ అంటూ .....................
2. ఉదయం నిద్ర నుండి లేవగానే ఇంటి వారందరికీ ............ చేస్తాం.
3. అన్నం మేము ................తో తింటాం.
4. ఎవరైనా మనకు ఏదైనా ఇస్తే వాటిని .....................తో తీసుకుంటాం.
5. ఏదైనా ............... విషయం ఉంటే ఇతరులకు చెప్పుము.
6. మహాప్రవక్త సహచరుల పేర్లు తీసుకున్నాక................ అని అంటాం.
7. ఒకే పళ్ళెంలో తింటుంటే వారి వారి .................... ఉన్న దాంట్లో నుంచి తింటాం.
8. భోజనానంతరం అల్లాహ్‌కు .................. తెలుపుకుంటాం.



# 23. ముస్లిం అబ్బాయి

ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి
చెప్పేది చేస్తాడు
చేసింది చెప్తాడు
ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి
ఎప్పుడు మంచినే పెంచుతాడు
తన ప్రభువంటే భయపడతాడు
ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి
నోరు విప్పితే సత్యం పలుకుతాడు
ఏదైనా తూనిక చేస్తే నికరంగ తూచి ఇస్తాడు
ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి
గిట్టవు- చౌర్యం, చాడీలు
పట్టవు- పరనింద, పరుష పలుకులు
ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి
నిస్సహాయులకు చేస్తాడు సహాయం
వ్యాధిగ్రస్తులకు చేకూర్చుతాడు ప్రయోజనం
ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి

చిన్నల హక్కు గ్రహిస్తాడు
పెద్దలకు వినయంతో గౌరవిస్తాడు
ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి
ప్రతిదినం నమాజులు చేస్తాడు
దినదినం ప్రగతి సాధిస్తాడు
ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి
దైవం, ప్రవక్తల మాటలు ఆత్మీయం
వాటిననుసరించే అబ్బాయి జీవితం
ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి
సత్యధర్మాన్ని అనుసరిస్తాడు
దైవ సంతోషాన్ని ఆపేక్షిస్తాడు
ముస్లిం అబ్బాయి
మేలైన అబ్బాయి



# 24. మంచి అలవాట్లు

మనం ముస్లిములుగా ఎలా మెలగాలి? సత్య ధర్మానుసారం ప్రవర్తిస్తాం. ప్రయోజనపడే పనులు చేస్తాం; ఇతరుల్ని కూడా మంచి పనులు చేయండని పురికొల్పుతాం. ఎప్పుడు అల్లాహ్‌తో భయపడతాం. చెడు పనులకు దూరంగా ఉంటాం. అల్లాహ్ మనం చేసేదంత గ్రహిస్తున్నాడు. ఏ పని కూడా ఆయనకు మరుగున లేదు. చెడు పనులు చేశామంటే తీవ్ర శిక్షకు గురిచేస్తాడు అల్లాహ్ అని భయపడతాం. మనం ఎప్పుడు సత్యం పలుకుతాం. మరిచి కూడా అబద్ధం పలుకము. ఎక్కడైనా తప్పు దొర్లితే దానిని సమర్థించకుండా తప్పును ఒప్పుకుంటాం. యదార్థం తెలిసి క్షమాపణ కోరుకుంటాం. చెప్పేదిచేసి చూపెడతాం. వాగ్దానం చేస్తే పూర్తి చేస్తాం. దానివల్ల నష్టం కలిగినా మాట మార్చం. ఏదైతేచేస్తామో అదే చెబుతాం కూడా. ఆడంబరాలు పలుకం. అడక్కుండా ఎవరి వస్తువులూ ముట్టం. పరుష పదాలు పలుకం. పరులను నొప్పించక ఉంటాం. చాడీలు చెప్పం, పరోక్ష నింద కూడా చెయ్యం. కుంటి, గుడ్డి, చేతులు లేనివారు, నిస్సహాయులు, వ్యాధిగ్రస్తులు, బలహీనులకు సహాయపడతాం. చిన్న చిన్న పిల్లలు, పాఠశాల జూనియర్లు అమాయకంగా పలికే మాటలు విని సంతోషపడుతాం. వారిని ఆప్యాయతతో చూస్తాం. ఆటపాటల్లో మాతో కలిసి ఉండేట్లు చూస్తాం తప్పులు చేస్తే మన్నించి క్షమిస్తాం.

తల్లిదండ్రులు మనల్ని గారాబంగ పెంచారు, పోషించారు. గురువు గారు మంచి విద్య ప్రసాదించారు. వీరందరికీ మేమెంతో కృతజ్ఞులం. వీరికి సేవ చేయడం మా కర్తవ్యం. వీరిని గౌరవించి సత్కరించడం మన బాధ్యత. వినయంతో వీరి పట్ల విధేయత కలిగి వుండాలి. వీరే మాకు పెద్దలు, మేమంటే వీరికెంతో సంతోషం. వీరికి అయిష్టత కల్గించకుండా జాగ్రత్త పడుతాం. అల్లాహ్ మనకెంతో సహాయం చేశాడు. ఆయనకు కృతజ్ఞత తెలుపుకోవడానికి మనం వేళకు నమాజు చేస్తాం. మహాప్రవక్త మనకు శ్రేష్టమైన మార్గం చూపించారు. ఆయన లేకుంటే మేము మార్గభ్రష్టులై ఉండేవారం. అల్లాహ్, మహాప్రవక్త(స) మాటల్ని మనం శ్రద్ధగా వింటాం. వాటిపై నడుచుకొంటూ బ్రతుకుతాం. మా తల్లిదండ్రుల కంటే ఎక్కువగా వీరిని ప్రేమిస్తాం.

మంచిమాటలు నేర్పి మనల్ని సజ్జనులుగా చేసింది సత్యధర్మం- ఇస్లాం. మేము ముస్లింలము. ఇస్లాం చూపించిన చక్కటి, నిత్య సత్యమైన హితవులననుసరించి నడుస్తాం.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. చెడు పనులు చేస్తే అల్లాహ్ మనల్ని ఏం చేస్తాడు?
2. మనం ఎలాంటి వారికి సహాయం చేయాలి.
3. చిన్న పిల్లలు తప్పు చేస్తే ఏం చేయాలి?

4. మనం మన తల్లిదండ్రులకంటే కూడా ఎవరిని ఎక్కువగా ప్రేమిస్తాం?
5. తల్లిదండ్రులు, గురువుల సేవ ఎందుకు చేయాలి?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. మనం ఎప్పుడు ..........................కు భయపడతాం. చెడు పనులకు దూరంగా ఉంటాం.
2. మనం ఎప్పుడూ ........... పలుకుతాం. మరచి కూడా అబద్ధం పలకము.
3. ఎప్పుడైనా తప్పుదొర్లితే ............... ఒప్పుకుంటాం.
4. ఎవరికైనా ............ చేస్తే దాన్ని పూర్తి చేస్తాం.
5. మహాప్రవక్త మనకు ................ మార్గం చూపారు. ఆయన లేకుంటే మేము మార్గభ్రష్టులై ఉండేవారం.
6. మనం .................. ఇస్లాం చూపించిన మార్గంలో నడుస్తాం.



# 25. ఖుర్‌ఆన్ చదివేందుకు నిబంధనలు

దివ్యగ్రంథం ఖుర్‌ఆన్ అల్లాహ్ మనకిచ్చిన ఉద్గ్రంథం. ఈ గ్రంథాన్ని అల్లాహ్ మహాప్రవక్త ముహమ్మద్(స) ద్వారా మానవులకు అందజేయబడింది. ఈ ఉద్గ్రంథం మానవాళికి జీవిత విధానాన్ని ప్రబోధిస్తుంది. మేము ఈ గ్రంథాన్ని అనుదినం పఠిస్తూ ఉంటాం. గ్రంథ పారాయణం చేసే సమయంలో కొన్ని విషయాలు దృష్టిలో పెట్టుకొంటాం. 1) అన్నింటికంటే ముందు పరిశుభ్రంగా వుజూ చేస్తాం. ఈ గ్రంథం అంటే మాకెంతో గౌరవం. వినయంతో చేత పట్టుకొని, కళ్ళకు అద్దుకొని ఆత్మీయతతో చూస్తాం. 2) ఎక్కడైనా కిందపడుతుందేమోనన్న భయంతో రెండు చేతులతో భద్రంగా పట్టుకొని చదువుతాం 3) రిహాల్ లేక ఎత్తైన ప్రదేశంలో విధేయతతో గ్రంథాన్ని తెరుస్తాం. 4) **అఊజుబిల్లాహి మినష్షైతాన్ నిర్రజీమ్** أَعُوذُ بِاللّٰهِ مِنَ الشَّيْطٰنِ الرَّجِيْمِ అని పఠించి గ్రంథ పారాయణ సందర్భంలో షైతాన్ అడ్డంకులు కలగకుండా జాగ్రత్తపడతాం 5) తరువాత 'బిస్మిల్లా హిర్రహ్మానిర్రహీం' పఠించి మొదలు పెడతాం 6) ఆగి ఆగి స్వచ్ఛంగా చదువుతాం 7) జేర్, జబర్, పేష్‌లతో ఒక్కొక్క అక్షరాన్ని గమనించి తప్పులు లేకుండా చదువుతాం 8) విరామ చిహ్నాల్ని గమనిస్తూ చదువుతాం 9) పఠించే సమయంలో అటూ ఇటూ చూడము ఇంకా పరులతో మాట్లాడం. మనసును లగ్నం చేసి పఠిస్తాం 10) పఠనం ముగించాక గ్రంథాన్ని గలేబులో పెట్టి వినయంతో ఎత్తైన ప్రదేశంలో ఉంచుతాం.

## ఖుర్‌ఆన్ పఠనం - నియమాలు

ఖుర్‌ఆన్ అక్షరాలు మనకు ముందు నుంచే పరిచయం

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ر | ذ | د | خ | ح | ج | ث | ت | ب | ا |
| ف | غ | ع | ظ | ط | ض | ص | ش | س | ز |
| ی | ء | ھ | ہ | و | ن | م | ل | ک | ق |

**జబర్** (ـَ) **జేర్** (ـِ) **పేష్** (ـُ) **జజమ్** (ـْ)

**తష్‌దీద్** (ـّ) వగైరా పెట్టినప్పుడు ఆయా అక్షరాల శబ్దం ఏవిధంగా మారుతుందో మనకు బాగా తెలుసు.

**జబర్‌కు ఉదాహరణ :** اَدَبَ دَرَسَ دَرَجَ شَجَرَ فَرَضَ

**జేర్‌కు ఉదాహరణ :** بِ تِ جِ سِ كِ لِ مِ نِ اِبِلِ

**పేష్‌కు ఉదాహరణ :** كُتُبُ صُحُفُ رُسُلُ عُمُرُ فُعُلُ

జజమ్‌కు ఉదాహరణ : دَسْ دِنْ رُکْ اَفْضَلْ فُرْصَتْ

తష్‌దీద్‌కు ఉదాహరణ : رَبُّ حَقُّ صَلِّ اِنَّ سَبِّحْ ثُمَّ

అన్నీ కలిపి ఉదాహరణ :

حَضْرَتْ اَحْمَدْ مُحَمَّدْ نَبِیْ رَحْمَتْ
خُدَا سَبْ کَا خَالِقْ هَیْ۔ وُهِیْ رَازِقْ وَمَالِکْ
هَیْ اُسِیْ کِیْ عِبَادَتْ کَرْ۔ اُسِیْ کَا کَهَا کَرْ۔
وُهِیْ هَمَارِیْ مَدَدْ کَرْتَا هَیْ۔

ఇంకా ఎన్నో నియమాలున్నాయి. వాటిని జ్ఞాపకముంచుకోవటం అవసరం. నియమాలు తెలియకపోతే గ్రంథ పఠనం సాధ్యపడదు.

1. **తన్‌వీన్** అంటే రెండు జబర్‌లు, రెండు జేర్‌లు, రెండు పేష్‌లు.

تَنْوِیْن :- دو زبر ـً ، دو زیر ـٍ ، دو پیش ـٌ

ఏ అక్షరం మీద **తన్‌వీన్** ـً వుంటుందో దాని శబ్దం ఎలా పలకాలంటే ఆ అక్షరం మీద ఒక జబర్, ఒక జేర్, ఒక పేష్‌తో పాటే నకారం తగిలించి పలకాలి. అంటే :

బన్ بً జన్ جً దన్ دً మన్ مً

ఏ అక్షరం మీద **జేర్ తన్‌వీన్** ـٍ వుంటే దాన్ని ఇలా పలకాలి.

బిన్ بٍ జిన్ جٍ దిన్ دٍ మిన్ مٍ

ఏ అక్షరం మీద **పేష్ తన్‌వీన్** ـٌ వుంటే దాన్ని ఇలా పలకాలి

బున్ بٌ జున్ جٌ దున్ دٌ మున్ مٌ

2. **నిలువు జబర్** ـٰ **నిలువు జేర్** ـٖ తలక్రిందుల చేసిన **పేష్** ـٗ వుంటే ఇలా పలకాలి.

బా بٰ జా جٰ సా سٰ లా لٰ

బీ بٖ జీ جٖ సీ سٖ దీ دٖ

బూ بٗ కూ کٗ మూ مٗ లూ لٗ

لَهٗ بِهٖ اٰدَمُ رَبَّهٗ اِسْمِهٖ مٰلِكِ

3. దివ్య గ్రంథంలో కొన్ని అక్షరాలపై జబర్ గాని, జేర్ గాని, పేష్ గాని ఉండదు. అవి చదవబడవు కూడా. ఉదాహరణకు

زَكٰوةً (زَكَاتْ) . بِالْهُدٰى (بِلْهُدَا) . اُولٰٓئِكَ (اُلَائِكَ)

4. **మద్ చదవటం :** మద్ అంటే లాగటం, పొడిగించటం అన్నమాట. ఇది రెండు విధాలు. **మొదటిది చిన్న మద్** ~ దేనిపై ఇది ఉంటుందో దాన్ని రెండు అలిఫ్‌ల సమానంగా పొడిగించి చదవాలి. ఉదాహరణకు

اِلٰٓى اَهْلِهٖ - وَمَآ اُنْزِلَ - اَغْرَقْنَآ اٰلِ فِرْعَوْنَ

**పెద్ద మద్** ~ ఏ అక్షరంపై పెద్ద మద్ తగిలించబడుతుందో దానిని అలిఫ్‌కు మూడింతలు పొడిగించి చదవాలి. ఉదాహరణకు :

حَدَآئِقَ - اَلْحَآقَّةُ - فَجَزَآءُهٗ - كَآفَّةً -

5. **ఇద్గాం :** అంటే ద్విత్వాక్షరం. ఒక అక్షరంపై జబర్, జేర్, పేష్ వుంటే దాని తరువాత రెండు అక్షరాలు ఎలా ఉన్నాయంటే ఒకదానిపై జజమ్, రెండవ దానిపై తష్దీద్ వుంటే జజమ్ వున్న అక్షరాన్ని వదలి మొదటి అక్షరాన్ని తష్దీద్ వున్న అక్షరంతో కలిపేస్తాం.

كِدْتَّ (كِتَّ) . لُقْتُّ (لُكُّ) . مِنْ رَّ (مِرَّ)
لَقَدْ كِدْتَّ - نَخْلُقْكُّمْ - مِنْ رَّسُوْلٍ -

6. **నూన్- యె- ఖతనీ :** ఖుర్ఆన్ గ్రంథంలో ఒక్కొక్క చోట అలిఫ్ ఖాళీ, లేదా అలిఫ్‌లామ్ ఖాళీగా ఉంటుంది. దానికి ముందు ఒక చిన్న 'నూన్' వ్రాసి ఉంటుంది. దీనికి ఎల్లప్పుడూ జేర్ ఇచ్చి వుంటారు. దీనిని ఆ తరువాత వచ్చే 'జజమ్' లేద తష్దీద్ అక్షరంతో కలుపుతాం.

نُوْحُ نِ ابْنَهٗ (نُوْحُ نِبْنَهٗ) ، شَيْبَا نِ السَّمَآءُ (شَيْبَ نِسَّمَاءُ)

7. **ఛోటీ మీమ్ :** నూన్-యె-సాకిన్ లేదా తన్వీన్ తర్వాత 'బె' ఉన్నట్లయితే 'బె'కు ముందు ఒక చిన్న 'మీమ్' వ్రాసి ఉంటుంది. ఇక్కడ నూన్ లేదా తన్వీన్‌కు బదులు 'మీమ్' శబ్దాన్నే పలుకుతాం.

اَنْۢبِيَاءَ (اَمْبِيَاءَ) - مِنْۢ بَعْدِ (مِمْبَعْدِ) - اَبَدًاۢ بِمَا (اَبَدَمْ بِمَا)

8. **ముఖత్తఆత్ అక్షరములు :** ఇవి వేరువేరుగా చదువబడుతాయి. ఖుర్ఆన్ గ్రంథంలో కొన్ని సూరాల ప్రారంభంలోనే కొన్ని అక్షరాలున్నాయి. వాటిని కలిపి చదవకుండా, వేరు వేరుగా చదవుతాం. వాటిని ముఖత్తఆత్ అక్షరాలని అంటాం.

صٓ (صَادْ) قٓ (قَافْ) نٓ (نُوْنْ) طٰهٰ (طَاهَا)

يٰسٓ (يَاسِيْنْ) طٰسٓ (طَاسِيْنْ) حٰمٓ (حَامِيْمْ)

الٓمّٓ (اَلِفْ لَامْ مِيْمْ) الٓر (اَلِفْ لَامْ رَا) طٰسٓمّٓ (طَاسِيْمْ مِيْمْ)

عٓسٓقٓ (عَيْنْ سِيْنْ قَافْ) الٓمّٓصٓ (اَلِفْ لَامْ مِيْمْ صَادْ)

الٓمّٓرٰ (اَلِفْ لَامْ مِيْمْ رَا) كٓهٰيٰعٓصٓ (كَافْ هَا يَا عَيْنْ صَادْ)

9. విరామం (ఆపడం) : ఖుర్ఆన్ గ్రంథంలో ఎక్కువగా ఈ క్రింది అక్షరాల గుర్తులుంటాయి. ఈ అక్షరాలున్న చోట ఆపడం అవసరం. గుర్తులు

○ ط م ج

ఏదైనా అక్షరం తరువాత ఈ గుర్తులు వచ్చాయంటే దానికంటే ముందు వచ్చిన అక్షరంతో కలిపివేయాలి.

خُلُقٌ ○ (خُلُقْ) اُفُكٌ ○ (اُفُكْ) وَقَبَ ط (وَقَبْ) ذِكْرُكَ ○ (ذِكْرُكْ)

فِيْهِ ج (فِيْهْ) مَرْضِيَّةً ط (مَرْضِيَّهْ) بَيِّنَةٌ ج (بَيِّنَهْ) خَاشِعَةٌ ○ (خَاشِعَهْ)

ఈ విరామ గుర్తులకు ముందు **అలిఫ్** **الف** లేదా ఇ ی ఖాళీ లేదా ముందున్న అక్షరంపై రెండు జబర్లు ఉంటే ఒకే జబర్ చదవాలి.

رَحِيمًا ○ وَلَدًا ط ضُحًىٰ م مُصَلًّى ط

(رَحِيمَا) (وَلَدَا) (ضُحَا) (مُصَلَّا)

ఈ విరామ అక్షరాలకు ముందు ఏదైనా అక్షరం **'సాకిన్'** ఉన్నట్లయితే ఏ మార్పు చేయకుండా చదవాలి.

فَحَدِّثْ ○ لِلذِّكْرٰى زَكَرِيَّا ○ مَاهِيَهْ ط

(فَحَدِّثْ) (لِلذِّكْرٰى) (زَكَرِيَّا) (مَاهِيَهْ)

ఒకవేళ ( ○ ) ఉండి దానిపైన ( لا ○ ) ఉన్నట్లయితే అక్కడ ఆగనవసరం లేదు.

**10. విరామ చిహ్నాలలో కొన్ని**

لا قف صلے ص ز ق

ఎక్కడైతే **لا** వ్రాసి ఉంటుందో అక్కడ ఆగనవసరం లేదు.

ఎక్కడైతే **قف** గుర్తు ఉంటుందో అక్కడ ఆగడం మంచిది.

ఈ గుర్తు صلے ఉన్నచోట ఆగటానికి బదులు, ముందుకు వెళ్ళడం మంచిది.

ఎక్కడైతే ص ఈ అక్షరం ఉంటుందో అక్కడ ఆగవచ్చు.

ఈ గుర్తు ز ఉన్నచోట కూడా ఆగే అనుమతి వుంది.

ఈ గుర్తు ق ఉన్నచోట కొందరు ఆగడం మంచిదంటారు. ఇంకా కొందరు ఆగకూడదని అంటారు.

ఖుర్‌ఆన్ చదివే ఈ నియమాలన్నీ నేర్చుకొన్నాం. ఇక చకచకా చక్కగా చదవగలుగుదాం.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. ఖుర్‌ఆన్ చదవాలనుకుంటే ముందుగా మీరు ఏంచేస్తారు?
2. ఖుర్‌ఆన్ పఠించేటప్పుడు ఏ విషయాలను గుర్తుంచుకోవాలి?

3. 'తన్వీన్'ను ఎన్ని విధాలుగా రాస్తారు?

4. 'ఇద్గామ్' అంటే ఏమిటి?

5. 'నూనె ఖుత్నీ'ను ఏవిధంగా చదవాలి?

6. ఏ అక్షరాలను 'హురూఫె ముఖత్తఆత్' అంటారు? ఉదాహరణ ఇవ్వండి?

7. ఖుర్ఆన్‌లో ఆయత్‌కు మధ్య ' لا ' రాసి ఉంటే ఏం చేయాలి?

8. విరామ చిహ్నాలకు ముందు 'అలిఫ్' లేదా 'మా' ఖాళీ లేదా ముందున్న అక్షరంపై రెండు జబర్లు ఉంటే ఎలా చదవాలి? ఈ రెంటికీ ఒక్కొక్క ఉదాహరణ ఇవ్వండి.

9. విరామ చిహ్నం ఉన్న చివరి అక్షరాన్ని ఏవిధంగా చదవాలి?

10. لا قف صلے ص ز ق వీటిని ఏ చిహ్నాలు అంటారు? ఈ చిహ్నాలు ఖుర్ఆన్‌లో వస్తే ఏం చేయాలి?

**(ఆ) ఈ క్రింది వాటిని జత చేయండి?**

| | | |
|---|---|---|
| **1.** | జబర్ | ُ |
| **2.** | జజమ్ | ّ |
| **3.** | తష్దీద్ | َ |
| **4.** | తన్వీన్ | ً |
| **5.** | ఖడా జబర్ | ٰ |
| **6.** | నూన్-యె-ఖతనీ | نوحُ نِ ابْنَهٗ |



# 26. నమాజ్

అజ్‌కార్, దుఆ-యె- మొదలైనవి

బిస్మిల్లా హిర్రహ్మానిర్రహీం — بِسۡمِ اللّٰہِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ

తక్బీర్-యె-తహ్రీమా : అల్లాహుఅక్బర్ — اَللّٰہُ اَکۡبَر

సనా : సుబ్‌హానకల్లాహుమ్మ వ బిహమ్దిక వతబారకస్ముక వతఆలా జద్దుక వలా ఇలాహ గైరుక్.

ثنا :- سُبۡحٰنَكَ اللّٰهُمَّ وَبِحَمۡدِكَ وَتَبَارَكَ اسۡمُكَ وَتَعَالٰى جَدُّكَ وَلَاۤ اِلٰهَ غَيۡرُكَ ۝

కొంతమంది సనాతో పాటు ఇది కూడా చదువుతారు.

اَللّٰهُمَّ بَاعِدۡ بَيۡنِىۡ وَ بَيۡنَ خَطَايَاىَ كَمَا بَاعَدۡتَّ
بَيۡنَ الۡمَشۡرِقِ وَالۡمَغۡرِبِ ○ اَللّٰهُمَّ نَقِّنِىۡ مِنۡ
خَطَايَاىَ كَمَا يُنَقَّى الثَّوۡبُ الۡاَبۡيَضُ مِنَ
الدَّنَسِ ○ اَللّٰهُمَّ اغۡسِلۡنِىۡ مِنۡ خَطَايَاىَ بِالۡمَآءِ
وَالثَّلۡجِ وَالۡبَرَدِ ○

అల్లాహుమ్మ బాఇద్‌బయ్‌ని వ బయ్‌న ఖతాయాయ కమా బఅద్‌త్త బయ్‌నల్ మష్‌రిఖి వల్ మగ్‌రిబి అల్లాహుమ్మ నఖ్ఖిని మిన్ ఖతాయాయ కమా యునఖ్ఖస్సౌబుల్ అబ్‌యజు మినద్దనసి. అల్లాహుమ్మగ్‌సిల్‌ని మిన్ ఖతాయాయ బిల్‌మాఇ వత్తల్‌జి వల్‌బర్‌ది.

تعوذ اَعُوۡذُ بِاللّٰہِ مِنَ الشَّيۡطٰنِ الرَّجِيۡمِ

తఅవ్వుజ్ : అవూజుబిల్లాహి మినష్షైతానిర్రజీమ్

تسمیہ :- بِسۡمِ اللّٰہِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

తస్మియ : బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్

سورۂ فاتحہ :- اَلۡحَمۡدُ لِلّٰہِ رَبِّ الۡعٰلَمِيۡنَ ○ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○ مٰلِكِ
يَوۡمِ الدِّيۡنِ ○ اِيَّاكَ نَعۡبُدُ وَاِيَّاكَ نَسۡتَعِيۡنُ ○ اِهۡدِنَا الصِّرَاطَ

الْمُسْتَقِيمَ ۝ صِرَاطَ الَّذِينَ اَنْعَمْتَ عَلَيْهِمْ ۝ غَيْرِ الْمَغْضُوبِ
عَلَيْهِمْ وَلَا الضَّالِّينَ ۝ آمِين ـ

**సూర-యె- ఫాతిహా :** అల్‌హమ్దులిల్లాహి రబ్బిల్ ఆలమీన్ అర్రహ్మానిర్రహీమ్ మాలికియౌమిద్దీన్ ఇయ్యాక న'బుదు వ ఇయ్యాక నస్తయీన్ ఇహ్దినస్సిరాతల్ ముస్తకీమ్ సిరాతల్లజీన అన్అమ్త అలైహిమ్ గైరిల్ మగ్జూబి అలైహిమ్. వలజ్జాల్లీన్ (ఆమీన్)

سورهٔ اخلاص :- قُلْ هُوَ اللّٰهُ اَحَدٌ ۝ اَللّٰهُ الصَّمَدُ ۝ لَمْ يَلِدْ ۙ
وَلَمْ يُوْلَدْ ۝ وَلَمْ يَكُنْ لَّهٗ كُفُوًا اَحَدٌ ۝

**సూర-యె- ఇఖ్లాస్ :** ఖుల్‌హు వల్లాహు అహద్ అల్లాహుస్సమద్ లమ్‌యలిద్ వలమ్ యూలద్ వలమ్‌యకున్‌లహు కుఫుఅన్ అహద్

**రుకూలో చదవబడే**

తస్బీహ్ : సుబ్‌హాన రబ్బియల్ అజీమ్ — رکوع کی تسبیح :- سُبْحَانَ رَبِّيَ الْعَظِيمِ

తస్మీహ్ : సమిఅల్లా హులిమన్ హమిద — تسمیع :- سَمِعَ اللّٰهُ لِمَنْ حَمِدَهٗ

తహ్మీద్ : రబ్బనాలకల్ హమ్ద్ — تحمید :- رَبَّنَا لَكَ الْحَمْدُ

కొంతమంది తహ్మీద్ తరువాత حَمْدًا كَثِيرًا طَيِّبًا مُبَارَكًا فِيهِ **హమ్దన్ కసీరన్ తయ్యిబన్ ముబారకన్ ఫీహ్** అని కూడా అంటారు.

సజ్దాలో చదవబడే తస్బీహ్ : سُبْحَانَ رَبِّيَ الْاَعْلٰى సుబ్‌హాన రబ్బియల్ ఆలా

కొంతమంది రెండు సజ్దాల మధ్య ఈ ప్రార్థన కూడా చదువుతారు.

رَبِّ اغْفِرْلِي وَارْحَمْنِي وَعَافِنِي وَاهْدِنِي وَارْزُقْنِي ۝

రబ్బిగ్ఫిర్‌లీ వర్‌హమ్‌ని వ ఆఫిని వహ్దిని వర్‌జుఖ్‌ని

تشہد :۔ اَلتَّحِيَّاتُ لِلّٰهِ وَالصَّلَوٰتُ وَالطَّيِّبٰتُ اَلسَّلَامُ عَلَيْكَ اَيُّهَا النَّبِيُّ وَرَحْمَةُ اللّٰهِ وَبَرَكَاتُهٗ اَلسَّلَامُ عَلَيْنَا وَعَلٰى عِبَادِ اللّٰهِ الصّٰلِحِيْنَ اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَرَسُوْلُهٗ

**తషహ్హుద్ :** అత్తహియ్యాతు లిల్లాహి వస్సలవాతు వత్తయ్యిబాతు అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు వరహ్మతుల్లాహి వ బరకాతుహు. అస్సలాము అలైనా వ అలా ఇబాదిల్లాహిస్సాలిహీన్. అష్హదు అల్లాహ్ ఇలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహు వ రసూలుహ్.

درود شریف اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ عَلٰى اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ

اَللّٰهُمَّ بَارِكْ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا بَارَكْتَ عَلٰى اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ ○

**దరూదె-యె- షరీఫ్:** అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్, వ అలా ఆలి ముహమ్మదిన్ కమాసల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ, ఇన్నక హమీదుమ్మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమాబారక్త అలా ఇబ్రాహీమ వ అలా ఆలిఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్.

درود شریف کے بعد کی دعا اَللّٰهُمَّ اِنِّيْ ظَلَمْتُ نَفْسِيْ ظُلْمًا كَثِيْرًا وَّلَا يَغْفِرُ الذُّنُوْبَ اِلَّا اَنْتَ فَاغْفِرْ لِيْ مَغْفِرَةً مِّنْ عِنْدِكَ وَارْحَمْنِيْ اِنَّكَ اَنْتَ الْغَفُوْرُ الرَّحِيْمُ

**దరూద్-యె- షరీఫ్ తరువాత** ఈ దుఆ చదువుతారు : అల్లాహుమ్మ ఇన్నీ జలమ్తు నఫ్సీ జుల్మన్ కసీర వలా యగ్ఫిరుజ్జునూబ ఇల్లా అన్త ఫగ్ఫిర్లీ మగ్ఫిరతమ్ మిన్ ఇమ్దిక వర్హమ్నీ ఇన్నక అన్తల్ గఫూరుర్ రహీమ్.

سلام :۔ اَلسَّلَامُ عَلَيْكُمْ وَرَحْمَةُ اللّٰهِ ○

**సలామ్ :** అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహ్

**دعائے قنوت**

اَللّٰهُمَّ اِنَّا نَسْتَعِيْنُكَ وَنَسْتَغْفِرُكَ وَنُؤْمِنُ بِكَ
وَنَتَوَكَّلُ عَلَيْكَ وَنُثْنِيْ عَلَيْكَ الْخَيْرَ وَ
نَشْكُرُكَ وَلَا نَكْفُرُكَ وَنَخْلَعُ وَنَتْرُكُ مَنْ يَّفْجُرُكَ اَللّٰهُمَّ اِيَّاكَ
نَعْبُدُ وَلَكَ نُصَلِّيْ وَنَسْجُدُ وَاِلَيْكَ نَسْعٰى وَنَحْفِدُ وَنَرْجُوْ
رَحْمَتَكَ وَنَخْشٰى عَذَابَكَ اِنَّ عَذَابَكَ بِالْكُفَّارِ مُلْحِقٌ

**దుఆ-యె- ఖునూత్ :** అల్లాహుమ్మ ఇన్నా నస్తయీనుక వ నస్తగ్ ఫిరుక, వనూ'మినుబిక, వ నతవక్కలు అలైక, వనుస్ని అలైకల్ ఖైర, వనష్కురక, వలా నక్ఫురుక వనఖ్లఉ, వనత్రుకు మయ్యఫ్జురుక అల్లాహుమ్మ ఇయ్యాక న'బుదు వలకనుసల్లి, వనస్జుదు, వ ఇలైక నస్అ, వనహ్ఫిదు వనర్జూ రహ్మతక వనఖ్షా అజాబక, ఇన్న అజాబక బిల్ కుఫ్ఫారి ముల్హిఖ్.

కొంతమంది చదివే దుఆ-యె- ఖునూత్ ఇక్కడ ఇవ్వబడింది.

اَللّٰهُمَّ اهْدِنِيْ فِيْ مَنْ هَدَيْتَ وَعَافِنِيْ فِيْ مَنْ
عَافَيْتَ وَتَوَلَّنِيْ فِيْ مَنْ تَوَلَّيْتَ وَبَارِكْ لِيْ فِيْ مَا اَعْطَيْتَ
وَقِنِيْ شَرَّ مَا قَضَيْتَ فَاِنَّكَ تَقْضِيْ وَلَا يُقْضٰى عَلَيْكَ
اِنَّهٗ لَا يَذِلُّ مَنْ وَّالَيْتَ وَلَا يَعِزُّ مَنْ عَادَيْتَ تَبَارَكْتَ
رَبَّنَا وَتَعَالَيْتَ وَصَلَّى اللّٰهُ عَلَى النَّبِيِّ ـ

అల్లాహుమ్మహ్దిని ఫీమన్ హదైత వ ఆఫిని ఫీమన్ ఆఫైత వతవల్లని ఫీమన్ తవల్లైత వ బారిక్‌లి ఫీమా అతైత వఖినీ షర్ర మాఖజైత ఫఇన్నక తఖ్జి వలాయుఖ్జా అలైక ఇన్నహు లా యజిల్లు మావలయిత వలా యఇజ్జు మన్ అదయ్‌త తబారక్‌త రబ్బనా వత'అలైత వసల్లల్లాహు అలన్నబియ్యి.

**నమాజు తరువాత చదివే దుఆ :**

**نماز کے بعد کی دعا**

اَللّٰهُمَّ اَنْتَ السَّلَامُ وَمِنْكَ السَّلَامُ
تَبَارَكْتَ يَا ذَا الْجَلَالِ وَالْاِكْرَامِ

అల్లాహుమ్మ అస్సలాము వ మిన్కస్సలాము, తబారక్త యా జల్‌జలాలి వల్ ఇక్రామ్.

**అజాన్ తరువాత చదివే దుఆ :**

اَللّٰهُمَّ رَبَّ هٰذِهِ الدَّعْوَةِ التَّامَّةِ وَ
الصَّلٰوةِ الْقَائِمَةِ اٰتِ مُحَمَّدَانِ الْوَسِيْلَةَ وَالْفَضِيْلَةَ
وَابْعَثْهُ مَقَامًا مَّحْمُوْدَانِ الَّذِيْ وَعَدْتَّهٗ -

**అల్లాహుమ్మ రబ్బ హాజిహి ద్దావతిత్తామ్మతి, వస్సలాతిల్ ఖాయిమతి, అతి ముహమ్మదనిల్ వసీలత, వల్ ఫజీలత, వబ్ అస్‌హు మఖామ మ్మహ్‌మూద నిల్లజీ వఅద్తహు.**

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. నమాజ్ ప్రారంభించేటప్పుడు రెండు చేతులు పైకెత్తి ఏమని పలుకుతారు?
2. 'తస్మీ' విన్న తరువాత 'రుకూ' నుంచి లేచి ఏమని పలకాలి?
3. సజ్దాలో పలికే 'తస్బీహ్' ఏమిటి? దాన్ని సజ్దాలో ఉన్నప్పుడు ఎన్నిసార్లు పలకాలి?
4. తషహ్హుద్ ఎప్పుడు చదువుతారు?
5. సలాం తిరిగే ముందు ఏం చదవాలి?
6. అజాన్ అయిన వెంటనే చదివే దుఆ ఏది?

**(ఆ) క్రింది వాటిని జతపరచండి**

| | | |
|---|---|---|
| 1. | తక్బీర్ | రబ్బనా లకల్ హమ్ద్ |
| 2. | తఅవ్వుజ్ | బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్ |
| 3. | తహ్‌మీద్ | అత్తహియ్యాతులిల్లాహి వస్సలవాతు వత్తయ్యిబాత్ |
| 4. | తషహ్హుద్ | అల్లాహుఅక్బర్ |
| 5. | తస్మియ | అవూజుబిల్లాహి మినష్షైతానిర్రహీమ్ |

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. .......................... రబ్బిల్ ఆలమీన్ ........ అర్రహ్మాని .................. వలజ్జాల్లీన్
2. ఖుల్ హువల్లాహు అహద్ ............................ కుఫువన్ అహద్
3. అల్లాహుమ్మ ఇన్నానస్తయీనుక వనస్తగ్‌ఫిరుక ................................................
   ................................ ఇన్న అజాబకబిల్ కుఫ్ఫారి ముల్‌హిఖ్
4. అత్తహియ్యాతులిల్లాహి ...............................
   ..................... అబ్దుహూ వ రసూలుహ్

**(సమాప్తం)**